

స్వర్గీయ మొసలి క్రిష్ణారెడ్డి గారు

ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియము తన మనంబున కగుఁదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్

– మహాభారతం

ఇతరులు ఏ పని చేస్తే మనకు బాధకలుగుతుందో, ఆ పనులను మనం ఇతరుల పట్ల చేయకుండా ఉండడమే అన్నిటికంటే గొప్ప ధర్మం.

# అనంతగీత

## (భగవద్గీతకు తెలుగులో గేయరూపం)

ప్రచురణ : యువ భారతి
ప్రచురణ సంఖ్య : 170
ప్రథమ ముద్రణ : 04-09-2007 (కృష్ణాష్టమి)
ప్రతులు : 2000
ముఖచిత్రం : శివ
అక్షరాల కూర్పు : మధు
అచ్చు : సూర్యా గ్రాఫిక్స్, ఫోన్ : 040-66752838
వెల : మంచిపనులు చేయడం

ప్రతులకు:

1) యువభారతి
C/o ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

2) శ్రీమతి ఇందిరా అనంతం , ఎం.ఐ.జి.-146,
"ఆనంద సారథి నిలయం" బాలాజీనగర్,
హౌసింగ్‌బోర్డ్ కాలనీ, కూకట్‌పల్లి - 500 072,
ఫోన్: 040-65572707, 9290702328

3) ఎం.దేవరాజ రెడ్డి చార్టర్డ్ అకౌంటెంట్, 303, సిద్దు
రెసిడెన్సి, 5-9-42/2, హిల్‌ఫోర్ట్ , స్ట్రీట్ నెం.2, బషీర్‌బాగ్,
హైదరాబాద్- 500 063, ఫోన్: 93999 35799

# మా మాట

చీకటిలో నుండే వెలుగు వచ్చిందని అంటారు. లేదా, వెలుగు లో నుండి చీకటి వచ్చిందా? ఏమో! వెలుగు మాయమైతే, చీకటి మిగులుతుంది. చీకటి మాయమవ్వాలంటే వెలుగు కావాలి; మరేమార్గం లేదు. అందుకనే "చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని, తిట్టుకుంటూ, వూరికే కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న స్ఫూర్తితో ఊపిరి పోసుకుంది యువభారతి.

నాలుగు దశాబ్దాల క్రితం వున్న పరిస్థితులు, వాటి గురించి మాకున్న అవగాహన, మేము చేయగలమనుకున్న పనులు, నిజానికి చేయవలసిన మంచి పనులెన్నో వున్నాయని ప్రారంభించాము. తెలుగు ఎదలో తెలుగుదనం వెల్లువలా పోవాలని, తెలుగింటిలో తెలుగుదీపం అఖండంగా వెలగాలని ఈ జాతి నిద్రలేచి, మత్తువదలి, మహోన్నత మానవాదర్శాలవైపు నిరంతర కృషితో పయనం సాగించాలనే ధ్యేయంతో ఉడుతా భక్తిగా కృషి చేస్తున్నది యువభారతి. భాషాభిమానం కలగాలంటే మాతృభాషా సాహిత్య పఠనమ్ ప్రథమ కర్తవ్యం అనే భావం మనసులో బలంగా నాటుకో వడానికి గాను, వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు ఉత్తమ సాహిత్యం అందించేందుకు పూనుకున్నది యువభారతి.

గత 43 సంవత్సరాలలో 169 పుస్తకాలను ప్రచురించింది. ఇందులో సాహిత్యలహరులు, కవితా వైభవాలు, వ్యాస సంపుటాలు,

కవితా సంపుటాలు మొదలగునవి వున్నాయి. గోష్ఠులు, సదస్సులను నిర్వహించాము. నందిని, మాస, త్రైమాస పత్రికలను నడిపాము.

పరిస్థితులు మారాయి. ప్రజల అభిప్రాయాలు, అలవాట్లు మారాయి. మారుతూ వుండటమే సహజం. మారుతున్న పరిస్థితుల కనుగుణంగా, వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలు, ముఖ్యంగా నేటి యువతకు స్ఫూర్తినిచ్చే పద్ధతిలో నిర్వహిస్తున్నాము.

సంస్థలు ఏవైనా పదికాలాల పాటు మనగలగాలంటే సమాజానికి ఉపయోగపడే మంచి పనులు చేయాలనుకుంటే, సమాజంలో వున్న సగటు స్వార్థం కన్న కొద్దిగా తక్కువగా స్వార్థం వున్న వ్యక్తులు-సభ్యులుగా ముందంజ వేయాలి. అందులో, సమర్థులై, భవిష్యద్దర్శనం చేయగలిగి, పదిమందినీ నడపగలిగిన నాయకత్వ సామర్థ్యాలున్న వ్యక్తులు కార్యక్రమాల నిర్వహణా బాధ్యతలను తలెత్తుకోవాలి. అధ్యక్షస్థానానికి, మంచి లక్షణాలు మరీ అవుసరం. యువభారతి అధ్యక్షులుగా లబ్ధప్రతిష్ఠులైన వారు, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు. ఆ తదుపరి, తమ ఆత్మీయతను మాకందించి ముందుకు నడిపించిన వారు ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు. ఆపైన డా॥ తిరుమల శ్రీనివాసా చార్యులుగారు, తిరుగులేని విధంగా నడిపారు.

ఆ క్రమంలో, ప్రస్తుతం అధ్యక్షస్థానాన్ని అలంకరిస్తున్న మా ఆత్మీయులు శ్రీ మాడభూషి అనంతా చార్యులు గారు. 38 సంవత్స రాల పై చిలుకు సాన్నిహిత్యం. కార్యకర్తగా, ఉపన్యాసకులుగా,

అధ్యాపకులుగా, చెదరని చిరునవ్వుతో, కష్టకాలంలో సైతం సంస్థను ముందుకు నడిపించాలన్న పట్టుదలతో, బాధ్యత వహిస్తున్న వారు.

భగవద్గీతను సులభశైలిలో "అనంతగీత"గా సిద్ధ పరిచారు. ఆరాధనీయమైన "గీత" ఎన్నో "గీత"లకి ప్రేరణనిచ్చింది. ఇస్తూ వుంటుంది. మన "గీత" మారాలనుకుంటే, గీత నాశ్రయించడం కన్న మిన్నమైన మార్గం వుందా? ఈ గీతలో చదివించే గుణం వుంది. ముందుకు నడిపించే గుణం వుంది. ఏదైనా, "పారాయణం చేస్తే పుణ్యం వస్తుంది" అనే భావనతో కాకుండా "ఆచరించడమే తరించడానికి మార్గం" అనుకున్నప్పుడు, ఎక్కువ ఫలితం దక్కుతుంది.

పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామ భద్రుండట...

అన్నట్లుగా ఆ పరమాత్మ సంకల్పం లేకపోతే, మా అనంతాచార్యులుగారు ఈ రచనా కార్యక్రమాన్ని సక్రమంగా పూర్తిచేయగలిగి వుండేవారా? మరో గీత మనందరి ముందుకు రాగలిగేదా? ఈ నాలుగు మాటలూ నేను పంచుకోగలిగివుండే వాడినా?

'నిమిత్తమాత్రం భవ'...

**4 సెప్టెంబరు 2007**

- వంగపల్లి విశ్వనాథం
సమావేశకర్త, యువభారతి

# శుభముల నొందుడు

1. శ్రీకృష్ణుండే గానము చేసిన
గీతయుండగా ఇతరములెందుకు
అనంతమైనది సులభమ్మైనది
నిత్యము చదువుడు శుభముల నొందుడు

2. జలస్నానమున శరీరశుభ్రత
గీతాస్నానము మనోశుభ్రతను
కలుగగ జేయును శాంతియు కలుగును
గీతను చదువుడు శుభముల నొందుడు

3. సర్వశాస్త్రముల సారము గీతయె
అమృతము స్వచ్ఛము సాత్త్విక రూపము
మానవ జాతికి తరణోపాయము
గీతను చదువుడు శుభముల నొందుడు

4. జీవితమందలి కలిగెడి ప్రశ్నల
సమాధానములు గీతను దొరకును
వ్యక్తిత్వమ్మును పెంపొందించును
గీతను చదువుడు శుభముల నొందుడు

5. యత్నముతోడను మానవులందరు
గీత పఠించిన శుభములు కలుగును
భయశోకమ్ములు పోవును నిజముగ
గీతను చదువుడు శుభముల నొందుడు

6. ఎల్లజనులును తెలియగ వలసిన
తీయని తెనుగున రూపము నొందిన
అనంతగీతను గీతాశాస్త్రము
గానము చేయుడు శుభముల నొందుడు

7. బ్రహ్మ విద్యయును యోగ శాస్త్రమును
నర నారాయణ చర్చా రూపము
జ్ఞాన విజ్ఞాన సంగమ కావ్యము
గీతను చదువుడు శుభములనొందుడు

8. చదువుట యోగము తెలియుట క్షేమము
చేయుట లాభము మర్మము తెలియుచు
మూఢ భావనల దరిని చేరకను
గీతను చదువుడు శుభముల నొందుడు

# సుజనులు మెచ్చగ

1. తల్లిరూపమే చీనమ్మాయెను
తండ్రిగ వెలిగెను తిరుమల రూపము
నాలో మంచికి కారణభూతులు
భక్తినొసంగెద అనంత గీతను

2. వ్యాసుడు మొదలుగ యోగులందరును
ఎన్నో భాషల ఎన్నో విధముల
భగవద్గీతను వెలుగగ చేసిరి
వారికి నిజమగు భక్తిని మ్రొక్కెద

3. శ్రీనివాసునకు విశ్వనాథునకు
రాఘవ వరునకు పూర్ణ చంద్రునకు
రవీంద్ర ఫణీంద్ర రామ భాస్కరుల
మురళి ప్రభాకర వేంకటేశ్వరుల

4 పురుషోత్తమునకు నాగేశ్వరునకు
శీలా సుధామ కామేశురాణి
యువభారతీయ బంధులందరికి
అభివందనములు తెలియగ జేసెద

5. నిస్స్వార్థమ్ముగ సేవలు చేయుచు
మంచిని మనసున నిలిపిన భక్తుడు
గణకుల గడుసరి దేవరాజునకు
శాంతియు శుభమును సంపద కలుగును

6 శివునకు మధునకు పాదచారులకు
అచ్చొత్తించిన జయకుమారునకు
యువ భారతీయ మిత్రులందరికి
అభిమానులకును కృతజ్ఞతాంజలి

7. శ్రీలను గూడిన భగవద్గీతను
తెనుగున జేయగ ప్రేరణనిచ్చిన
పూర్తి చేయుటకు అండగ నిలిచిన
రాజ దంపతులు నాకును మిత్రులు

8. సహచరి ఇందిర నాలో భాగము
ఇద్దరి ప్రాణము వెన్నెల తేజలు
వారికి కలుగును శుభమును శాంతియు
దైవరూపులగు సుజనులు మెచ్చగ

'చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది'



# గీతాసారాంశం





అయ్యిందేదో మంచికే అయింది.

అవుతున్నదేదో అదీ మంచికే అవుతుంది.

అవ్వబోయేదేదో కూడా మంచికే అవుతుంది.

నీవేమి పోగొట్టుకున్నావని నీవు విచారిస్తున్నావ్?

నీవేమి తెచ్చావని నీవు పోగొట్టుకుంటావ్?

నీవేమి సృష్టించావని నీకు నష్టం వాటిల్లింది?

నీవు ఏదైతే పొందావో అది ఇక్కడనుండే పొందావు.

ఏదైతే ఇచ్చావో ఇక్కడే ఇచ్చావు.

ఈనాడు నీవు నా సొంతం అనుకున్నదంతా,

నిన్న ఇంకొకరి సొంతం కాదా!

మరి రేపు మరొకరి సొంతం కాగలదు.

పరివర్తన చెందడం అనేది లోకం యొక్క పోకడ.

ధర్మాన్ని ఆచరించు ధర్మమే నిన్ను రక్షిస్తుంది.

## పల్లవి

"శ్రీకృష్ణుండే భారతమందున
క్రీడికి తెలిపిన గీతను వినుడీ"

# 1. అర్జున విషాదయోగము



1. శ్రీ సంజయునకు ధృతరాష్ట్రుండనె
నా కుమారులును పాండవ యోధులు
ధర్మమనందగు కురుక్షేత్రమున
యుద్ధము చేయగ ఏ మొనరించిరి

2. ధృతరాష్ట్రునితో సంజయుడిట్లనె
యుద్ధముచేయగ సిద్ధమునొందిన
పాండవ సైన్యముచూచి, సుయోధన
రాజును; ద్రోణునిసన్నిధి నిట్లనె

3. ద్రుపదునిపుత్రుడు నీ శిష్యుండును
ధీమంతుండగు ధృష్టద్యుమ్నుడు
మెండుగపన్నిన వ్యూహముచూడుము
అండనె పాండవసైన్యము ఉన్నది

4. ఇందలి యోధులు ధనుర్ధారులై
సేనాముఖమున యుద్ధముచేయను
భీమార్జునులకు సరియగువారలు
సాత్యకి విరటుడు ద్రుపదమహారథి

5. ధృష్టకేతుడును చేకితానుడును
మహాశూరుడగు కాశీరాజును
పురజిత్తుండును కుంతిభోజుడును
నరులను శ్రేష్ఠుడు శైబ్యుడునుండిరి

6. పరాక్రముండగు యుధామన్యుడును
వీరవరుండగు ఉత్తమౌజుడును
సుభద్రతనయుడు అభిమన్యుండును
మహారథులుగను ద్రౌపదిపుత్రులు

7. కనుడు ద్విజోత్తమ! మనదగు సైన్యము
తెలుపుచునుంటిని వివరణకోసమె
యుద్ధముచేయగ సిద్ధమునొందిన
పొందగుసుందర యోధులెందరో

8. వీరాచార్యులు మీరలు భీష్ముడు
కర్ణుడు కృపుడును అశ్వత్థామయు
సోమదత్తుడును వికర్ణ ముఖ్యులు
భూరిశ్రవుడును అందరువీరులె

9. రాజభక్తితో నాకొరకందరు
ప్రాణములొడ్డియు యుద్ధముచేయగ
యుద్ధపండితులు శస్త్రధారులును
పెక్కురెందరో శూరులుగలరుగ

10. అపరిమితంబగు మనదగుసైన్యము
అజేయమైనది భీష్మరక్షితము
భీమరక్షితము పాండవసైన్యము
పరిమితమైనది సులభనిర్జితము

11. వ్యూహమునందున మీమీస్థలముల
అన్నిదిక్కులను స్థిరముగ నుండుడు
సర్వవిధమ్ముల నిశ్చితమతులై
భీష్మాచార్యుని పరివేష్టింపుడు

12. ఆతనిపలుకులు పులకలెత్తగా
అతనికి హర్షము కలిగించుటకై
కురువృద్ధుండగు భీష్మాచార్యుడు
సింహధ్వనితో శంఖమునూదెను

13. వెంటనె మ్రోగెను సంకులు భేరులు
డోళ్లును డప్పులు కొమ్మువాద్యములు
వాద్యములన్నియు భీతిగొల్పుచును
దిక్కులన్నియును పిక్కటిల్లెనుగ

14. అప్పుడు వెంటనె ఆవలివైపున
తెల్లనిగుఱ్ఱాల్ కట్టిన రథమున
కృష్ణార్జునులు కూర్చునియుండిరి
దివ్యశంఖముల నూదిరివారలు

15. పాంచ జన్యమును పట్టెనుకృష్ణుడు
దేవదత్తమును పట్టెను పార్థుడు
పౌండ్రముచేకొనె భీమసేనుడును
పెద్దగనూదిరి భీతావహముగ

16. పాండవరాజగు యుధిష్ఠిరుండును
శంఖరాజమగు అనంతవిజయము
పూనెనునకులుడు సుఘోషశంఖము
సహదేవుండును మణిపుష్పకమును

17. ధనుర్ధారియగు కాశీరాజును
మహారథుండగు శిఖండి రూపుడు
ధృష్టద్యుమ్నుడు విరాట రాజును
అపరాజితుడగు సాత్యకివీరుడు

18. ద్రుపదుడు ద్రౌపదిపుత్రులైదుగురు
అచ్చటనుండిన రాజులందరును
మహావీరుడగు అభిమన్యుండును
వేరువేరుగా శంఖములూదిరి

19. పాండవయోధుల శంఖధ్వనులకు
పిక్కటిల్లెనుగ దిక్కులు నభమును
కౌరవపక్షపు గుండెలుపగిలెను
వికలములయ్యెను వారలమనసులు

20. పిమ్మటపొందిరి సమరోత్సాహము
నడుముబిగించిరి యుద్ధముచేయగ
కపిధ్వజుండును కనెనుకౌరవుల
ధనువును పట్టెను శస్త్రమునెత్తెను

21.రథమును వీడని ఉత్సాహముతో
ఉభయసైన్యముల మధ్యన నిలుపుము
హృషీకేశునికి పార్థునిపలుకులు
తెలిపెను సంజయు డాంబికేయునికి

22.యుద్ధముచేయగ వచ్చిన యోధుల
నందరచూచెద పరిశీలనతో
ఎవరితొయుద్ధము చేయగవలెనో
తెలియుటకొరకై రథమును నిలుపుము

23.దుర్బుద్ధుండగు దుర్యోధనుడును
వానికిప్రియమును చేకూర్చుటకై
యుద్ధముచేయగ వచ్చిన యోధుల
పరిపరివిధముల పరికింతునులే

24.పార్థుడుచెప్పిన మాటలు వినియెను
క్రమశిక్షణతో కూడినవీరుల
ఉభయసైన్యముల మధ్యభాగమున
సారధికృష్ణుడు నిలిపెను రథమును

25. భీష్మద్రోణులు ప్రముఖవీరులును
రాజులందరును కౌరవసేనను
యుద్ధముచేయగ కూడిరిచ్చటనె
అర్జునచూడుము వీరినిబాగుగ

26. అచ్చటచేరిన తండ్రులతాతల
గురువులబంధుల మేనమామలను
అన్నదమ్ములను కొడుకుల మనుమల
మేలునుకోరెడి మిత్రులందరిని

27. మామల వలసిన మంచివారలను
ఇరుదిక్కులగల సేనల చూచెను
అచ్చటచేరిన బంధులందరిని
పరిపరివిధముల పార్థుడుచూచెను

28. కరుణాభావము కూడినవాడై
విషాదమనమున నిట్లనిపలికెను
సమరోత్సాహము పూనినవీరుల
సమరరంగమున చూచితికృష్ణా!

29.అంగములన్నియు పట్టులుదప్పెను
పెదవులునాలుక పిడుచలుగట్టెను
ఒడలంతటను వణకులుపుట్టెను
వెంట్రుకలన్నియు నిక్కుచునిలచెను

30.గాండీవమ్మును జారుచునున్నది
శరీరమంతట వేడియుపుట్టెను
పరిపరివిధముల మనసుభ్రమించెను
ఇచ్చటనిప్పుడు నిలబడలేనిక

31.చెడుశకునములే కనబడుచున్నవి
విపరీతముగను నాకుకేశవా
యుద్ధమునందున స్వజనులందరిని
చంపుటచేతనె మేలుకలుగునా!

32.విజయముకోరను రాజ్యముకోరను
భోగముకోరను సుఖములుకోరను
రాజ్యము భోగము జీవితమ్మునే
సఫలము చేయున తెలుపుము కృష్ణా!

33.రాజ్యము సుఖమును భోగమునెవరిని
పొందుటకోసము కోరుచుంటిమో
ధనప్రాణమ్ముల ఆశలువదలియు
యుద్ధముచేయగ వారే వచ్చిరి

34.గురువులు తండ్రులు తాతలు కొడుకులు
మనుమలు మామలు మేనమామలును
బావమరదులును బంధువులందరు
యుద్ధముచేయగ ఇచ్చటచేరిరి

35.మూడులోకముల పాలన ఇచ్చిన
చంపగనోపను వారలనిప్పుడు
వారలునన్నే చంపగ కోరిన
రాజ్యముకోరుచు వారల చంపను

36.కౌరవసేనను చంపిన కలుగదు
ప్రీతియు సుఖమును మనకెప్పుడునూ
ఆతతాయులను చంపుటచేతను
పాపమువదలక మనలను చేరును

37.కౌరవసేనల బంధులనందర
మాధవ మనకిక చంపుటకూడదు
స్వజనులచంపిన మనలకెప్పుడును
సుఖమును కలుగదు శాంతియునుండదు

38.లోభమూలమున పిసినిగొట్టులై
వంశనాశమున కలుగుదోషమును
మిత్రద్రోహమున కలుగు నష్టమును
పొందు పాపమును తెలియకున్నచో

39.వంశనాశమున కలుగునష్టములు
తెలిసినవారమై ఓయి జనార్దన!
ఈ పాపములను దూరముచేయగ
ఆలోచనలను చేయగవలయును

40.వంశనాశమున పరంపరాగత
వంశధర్మములు నశించిపోవును
ధర్మమెనాశము పొందినయప్పుడు
వంశమంతయును ఆగడమొందును

41. కావున కృష్ణా! పాపముపెరిగిన
స్త్రీలందరును దూషితులగుదురు
స్త్రీలందరును దూషితులవగా
వర్ణములన్నియు కలియుటతథ్యము

42. వంశనాశనము చేసినవారల
వంశమంతయును నరకముచేరును
పితరులుపొందరు శాంతిని తృప్తిని
పితరులుపొందరు మేలగు గతులను

43. వర్ణములన్నియు కలియుటచేతను
వంశము శిథిలము చెందుట చేతను
పరంపరాగత వంశధర్మములు
జాతిధర్మములు కనబడకుండును

44. మానవధర్మము వదలినవారలు
నరకమునెప్పుడు పొందుచునుందురు
లోకములందున వారలవిధమును
తెలియుచునుండును ఓయి జనార్దన!

45. రాజ్యలాభమున సుఖములు పొందగ
మనవారలనే చంపుటపాపము
పాపమునెరిగియు చేయుచునుండుట
ఎంతదారుణము! ఎంతదారుణము!

46. ఆయుధమొందను యుద్ధముచేయను
ఆయుధమొందుచు యుద్ధముచేయుచు
కౌరవేయులే నన్నుచంపినను
మేలనియెంచుదు బాధనుపొందను

47. యుద్ధమునందున ధనుర్బాణములు
విసరివేయుచును శోకమునొందుచు
రథమునకూలిన పార్థునిమాటలు
చెప్పెసంజయుడు ధృతరాష్ట్రునితో

ఇది అర్జున విషాదయోగము

## 2. సాంఖ్య యోగము

1. అశ్రులునిండిన కరుణనుకూడిన
వ్యాకులపాటున విచారమ్ముతో
ఉన్నపార్థునికి కృష్ణునిపలుకులు
సంజయుడనియెను ధృతరాష్ట్రునితో

2. అర్జునతెలుపుము ఎట్లుకల్గినది
తగనిసమయమున మోహమునీలో
ఉత్తములెప్పుడు పొందరుదీనిని
సుఖమునుకూర్చదు కీర్తియుకలుగదు

3. పార్థుడ పొందకు పిరికితనమ్మును
తగదిది నీకిది తగినది కాదిది
వీడుమపౌరుష భావము నీలో
యుద్ధముచేయగ సిద్ధముకమ్మిక

4. పార్థుండనియెను పార్థసారథికి
పితామహుండగు భీష్మాచార్యుని
ద్రోణుని పూజ్యుల నెట్లెదిరింతును
అమ్ములచేతను యుద్ధమునందున

5. గొప్పవారలను గురులను చంపక
బిచ్చమెత్తుకొని బ్రతుకుటయుక్తము
వారలచంపిన రక్తమునిండిన
రాజ్యభోగములు పొందను నేనిక

6. సమరముచేయుట తగునో తగదో
జయాపజయములు తెలియదెప్పుడును
మనకు కౌరవులు బంధువులేకద
వారలచంపుట కిష్టముచెందను

7. పిరికివాడనై గిలగిలలాడుదు
ధర్మాధర్మపు కార్యమునెరుగను
నీకుశిష్యుడను శరణుకోరుదును
నిజమునుతెలుపుము మంచినికూర్చుము

8. శత్రువులుండని సంపదకూడిన
రాజ్యముదొరకిన స్వర్గముదొరకిన
దేహమునంతను కాల్చెడి శోకపు
తాపముతీర్చెడి మార్గము తెలియదు

9. యుద్ధముచేయను యుద్ధముచేయను
స్థిరముగపలికెను మౌనమునొందెను
కృష్ణునితోడను పార్థునిపలుకులు
ధృతరాష్ట్రునితో సంజయుడనియెను

10. ఆంబికేయుడా! సేనలమధ్యన
ఉన్నఫల్గుణుని చూచెను కృష్ణుడు
శోకమునిండిన ధైర్యమువీడిన
ఆతనినడిగెను మందహాసమున

11. కూడనిశోకము పొందుచునుంటివి
తెలిసిన యట్టుల పలుకుచునుంటివి
ప్రాణముగల్గిన పోయిన వారల
గూర్చినశోకము పండితులొందరు

12. నీవును నేనును రాజులందరును
ఎప్పుడునుందుము ఎప్పటికుందుము
ఆత్మయెనుండును శరీరముండదు
మనమెప్పటికిని స్థిరముగనుందుము

13.మనమీదేహము దాల్చుచుపొందిన
కుమార యవ్వన ముసలితనమ్ములు
మళ్లీపొందును మరియొక దేహము
ధీరుడు పొందదు తనువున మోహము

14.సుఖమును దుఃఖము వేడియుచలువయు
పొందుచునుందుము దేహముతాకిన
పుట్టునుగిట్టును నిత్యము కావివి
సహింపుమర్జున వీటినెప్పుడును

15.సుఖదుఃఖమ్ముల సమముగచూచును
ధీరుడెప్పుడును మానవోత్తమా!
విషయయోగమున మార్పును చెందని
వాడేస్థిరుడై మోక్షమునొందును

16.లేనిదానికిని ఉనికియెనుండదు
ఉన్నదానికిని లేమియునుండదు
ఈరెంటికిగల వాస్తవభావము
తత్త్వమునెరిగిన వానికితెలియును

17. నాశములేనిది నిజముగనాత్మయె
జగములనంతయు నిండియేయున్నది
దానినినాశము చేయుట యన్నది
జగమున ఎవనికి సాధ్యముకానిది

18. దేహములన్నియు నాశముచెందును
ఆత్మయెప్పుడును నాశముచెందదు
నిత్యమైనదని తెలియుము ఫల్గుణ
కావున యుద్ధము చేయుము విజయుడ

19. ఆత్మలుచంపవు ఇతరులనెప్పుడు
ఆత్మలుచావవు ఎవరిచెనెప్పుడు
చావని ఆత్మల చంపని ఆత్మల
తత్త్వము తెలియును నిజమగు జ్ఞానికి

20. ఆత్మయెప్పుడును పుట్టదుగిట్టదు
భావవికారము నెప్పుడుపొందదు
నిత్యమునుండును సనాతనమ్మది
దేహముపోవును ఆత్మయెచావదు

21. నాశములేనిది నిత్యమైనదని
జననము మరణము లేనిదాత్మయని
మార్పుపొందదని తెలిసిన, పార్థా!
చంపించుటయును చంపుట జరుగదు

22. చిరిగినబట్టను విడచినరీతిని
కొత్తబట్టలను తొడగినవిధమున
పాతదేహమును ఆత్మయె విడుచును
కొత్తదేహమును ఆత్మయె పొందును

23. శస్త్రము తునుమదు అగ్నియుకాల్చదు
నీరును తడుపదు గాలియు నార్పదు
నిత్యమైనదగు ఆత్మ నెప్పుడును
నిత్యమైనదగు ఆత్మ నెన్నడును

24. చింపుటజరుగదు కాల్చుటజరుగదు
తడుపుటజరుగదు ఎండనిదాత్మయె
నిత్యమైనదియు సర్వవ్యాపియును
అచలము స్థాణువు శాశ్వతమైనది

25. ఇంద్రియాలకు వ్యక్తముకానిది
మనసునకందదు మార్పునుచెందదు
నిజముగ తెలియుము ఆత్మతత్త్వమును
శోకమునొందకు ఎప్పుడు దీనికి

26. జననమరణములు ఆత్మకుకలవని
భ్రమనుచెందినా భావనపొందిన
మననమునవీడుము అర్జున దీనిని
శోకమునొందకు ఎప్పుడుదీనికి

27. పుట్టినవానికి మరణము తప్పదు
మరణము తదుపరి పుట్టుక తప్పదు
దీనినెప్పుడును మార్చుట కుదరదు
శోకమునొందకు ఎప్పుడు దీనికి

28. పుట్టుక పూర్వపు విధమును తెలియదు
మరణము తదుపరి విధమును తెలియదు
వీటికి మధ్యన కొంచెము తెలియును
శోకమునొందుట కూడదు దీనికి

29. అచ్చెరువందుచు నొక్కడుచూచును
అచ్చెరువందుచు నొక్కడు చెప్పును
అచ్చెరువందుచు నొక్కడు విన్నను
తత్త్వము తెలియరు వీరలెవ్వరును

30. దేహమునందలి ఆత్మను తెలియుము
ఆత్మను చంపుట జరగదెప్పుడును
ఇదియే విధమగు ప్రాణులన్నిటికి
శోకమునొందకు ఎప్పుడు దీనికి

31. తనధర్మమును ఆచరించునెడ
భయమును పొందుట కూడదెన్నడును
రాజునకెప్పుడు యుద్ధముచేయుచు
ధర్మరక్షణము చేయుట మంచిది

32. అనుకోకుండనె ఆనుకూల్యమగు
యుద్ధముకలుగుట నీకేమంచిది
ధర్మయుద్ధములు రాజులకెపుడును
స్వర్గముచేరగ తెరచినద్వారము

33. నీధర్మమ్మును చేయకుండినను
నీవు యుద్ధమును చేయకుండినను
ధర్మమువీడియు, కీర్తినివీడియు
పాపముపొందుట తథ్యము వినుమా!

34. లోకులందరును నీయపకీర్తిని
పలుపలువిధముల పలుకుచునుందురు
సంభావితు డపకీర్తిని పొందుట
మరణముకంటెను బాధాకరమగు

35. ఇచ్చటకూడిన మహారథులలో
నీవేమిక్కిలి మాన్యవీరుడవు
యుద్ధముచేయక పారిపోయినను
చులకనచేయుచు పిరికిగ నెంతురు

36. నీలో వెలయుచు నున్న శక్తినే
నిందజేయుదురు నీశత్రువులే
నిన్నును శక్తిని తెగడుట కంటెను
దుఃఖ కారణము మరియేముందును

37.రణమున మరణము వీరస్వర్గమే
విజయము పొందిన రాజ్యభోగములె
నిశ్చితమతితో యుద్ధము చేయుము
లేలే విజయా! సాగుము ముందుకు

38.లాభనష్టముల జయాపజయముల
సుఖదుఃఖములను సమముగ చూడుము
పూనికపొందుము యుద్ధముచేయుము
ఇట్లుచేయగా పాపములంటవు

39.ఇప్పటివరకును తెలిపితి సాంఖ్యము
ఇప్పుడు తెలిపెద కర్మయోగమును
దానిని తెలిసియు నాచరింపుమిక
కర్మబంధములు విడిపోవునులే

40.కర్మను మొదలిడ నాశనముండదు
విపరీతములగు ఫలములుకలుగవు
కర్మయోగమును సాధనచేసిన
జననమరణముల భయమును పొందవు

41.కర్మయోగమున కలుగునదొకటే
భోగముకోరుచు వివేకహీనులు
చంచలబుద్ధిని దారులుకానరు
కోరికవెంబడి పరుగులనంతము

42.వేదవాదముల ప్రీతిని చెందిన
స్వర్గముకలదని చెప్పుచునుందురు
ఫలములనివ్వని వాక్యములెన్నో
వివేకహీనులు చెప్పుదురర్జున

43.స్వర్గమె పరమని కోరిక తోడను
జీవికి వలసిన ఫలములనిచ్చే
భోగసంపదలు పొందగ కోరుచు
వివిధ కార్యములు చేయుచునుందురు

44.భోగసంపదల కోరిక కలిగియు
మనసున నిలకడ లేనివారలకు
ఏకాగ్రత్వము సమాధి దశయును
నిలువదు కలుగదు భగవత్ప్రాప్తియు

45.వేదముతెలిపెడి త్రిగుణ విషయముల
భోగసాధనల వదలుము పార్థా!
ద్వంద్వముపొందక శుద్ధ సత్వమున
ఆత్మజ్ఞానిగ వెలుగుము నీవును

46.మహాజలాశయ మొందినవారలు
వాగులు చెరువులు పొందగ గోరరు
ఆత్మను తెలిసిన బ్రహ్మజ్ఞానికి
వేదములెందుకు వాదనలెందుకు

47.ఫలితము కోరుచు పనులను చేయకు
పనులను చేయుట విధియని యెంచుము
కర్మఫలములకు కరణము కాకుము
కర్తవ్యమె నీమదిలో నుంచుము

48.యోగస్థితుడవు కమ్ము ధనంజయ
ఆశను వదలుము కర్మను చేయుము
జయాపజయముల సమభావనయే
యోగమందురని నీవిక తెలియుము

49.ఫలితము కోరుచు కర్మను చేయుట
యోగము కంటెను ఎంతోతక్కువ
కావున పార్థా! యోగము చేయుము
ఫలితము కోరిన దీనుడవగుదువు.

50.పుణ్యపాపముల వదలుదురిక్కడ
బుద్ధిమంతులకు కర్మములంటవు
సమయోగమ్మును పొందుము నీవిక
కర్మల నేర్పును పొందుటె యోగము

51.సమబుద్ధులుగల జ్ఞానులందరును
కర్మఫలములను పూర్తిగ విడిచియు
జననమరణముల ముక్తిని పొందియు
నిర్వికారమగు పదమునొందెదరు

52.మోహంబనునది ఊబియెయగును
అందున చిక్కక వెలువడినప్పుడె
తెలిసిన తెలియని యిహపరభోగపు
బంధము విడివడి విరాగివగుదువు

53. పలుపలుమాటలు వినియుండుటచే
పలుపలువిధముల చెదరని బుద్ధిని
సమాధినొందుచు కదలకయున్నను
నీయెడ యోగము వదలక యుండును

54. అర్జునుడనియెను భగవంతునితో
సమాధిచే పరమాత్మను చేరిన
స్థితప్రజ్ఞునకు గుణములు మాటలు
ఉండుట కదలుట ఎయ్యవి? యెట్టివి?

55. కృష్ణుండనియెను పార్థునితోడను
మనసున కోరిక లన్నియు వదలుచు
ఆత్మానందము పరమయోగమును
పొందినవాడే స్థితప్రజ్ఞుడగు

56. దుఃఖమునొందియు మనసున తలపక
సుఖములుకలిగిన పొంగులుపోవక
రాగకోపములు వదలినవాడే
మునియగువాడే స్థితప్రజ్ఞుడగు

57.విషయములందున మమతనుపొందక
తనను పొందినా సంతసమొందక
పొందకయున్నను ద్వేషమునొందక
ఉన్నమనుజుడే స్థితప్రజ్ఞుడగు

58.తాబేలెట్లుగ అంగములన్నియు
బయటకువదలక తనలోనణచునొ
కోరికలన్నిటి స్వేచ్ఛగ వదలక
అణచిన వాడే స్థితప్రజ్ఞుడగు

59.వలదని వదలిన కోరికలన్నియు
తొలగిపోయినను వాసన వదలదు
దేవునితనలో చూడగల్గినను
పూర్తిగ తొలగును స్థితప్రజ్ఞునకు

60.కామమువీడక యుండిన పార్థా!
మథన శీలుడగు మానవుడెంతయు
యత్నముచేసిన పెనగులాడినను
మనసును లాగును కోరికలుండును

61. దేహమునంతయు వశమునునుంచిన
మనసున వదలక దైవమునంటుచు
నన్నేనమ్ముచు ధ్యానముచేసిన
స్థిరతను పొందిన స్థితప్రజ్ఞుడగు

62. విషయాలోచన చేసెడువానికి
ఆవిషయమ్మున బంధమేర్పడును
బంధమునొందిన కోరికేర్పడును
కోరికతీరక కోపమునొందును

63. కోపమువలననె మోహముపొందును
మోహముపెరిగిన జ్ఞానముతొలగును
జ్ఞానముతొలగిన బుద్ధినశించును
బుద్ధినశించిన పతనముచెందును

64. రాగము ద్వేషము నొందనిమనుజుడు
మనమును వశమున నుంచుకు మెదలిన
కోరికనొందిన అనుభవించినను
మనసునశాంతిని పొందుచునుండును

65.మనమున శాంతిని పొందినవెంటనె
దుఃఖములన్నియు దూరమగునులే
ప్రసన్నమొందిన కర్మయోగులకు
కోరికతొలగిన స్థితప్రజ్ఞుడగు

66.వశమున నుండక మనసుకులొంగిన
నిశ్చితబుద్ధియు అతనిని చెందదు
ఆస్తిక భావము లేనివారలకు
శాంతియు నుండదు సుఖమును కలుగదు

67.నడచెడినావను గాలియెనెట్టును
కోరికమనసును వదలకున్నచో
స్థిరతను పొందక యుండెడి మనుజుని
బుద్ధియు పూర్తిగ నాశముచెందును

68.కనుక ఫల్గుణా! ఎవని భావనలు
కోరిక వదలుచు మెదలుచుండునో
అట్టివానినే విషయము చెందక
బుద్ధులు చెదరక స్థితప్రజ్ఞుడగు

69. అందరికెయ్యది రాత్రిరూపమో
జాగృతరూపము స్థితప్రజ్ఞునకు
మందుడు కోరే ఐహిక సుఖములు
రాత్రియగునులే స్థితప్రజ్ఞునకు

70. నదులన్నియునూ సంద్రముచేరిన
అలజడినొందక లీనముచెందును
భోగములెన్నియు చేరుచునుండిన
అలజడి నొందక స్థితప్రజ్ఞుడగు

71. కోరిక వదలుచు మమతను వీడుచు
అహమును వదలుచు ఆశను వీడుచు
మెదలుచునుండెడి పరమపురుషుడే
శాంతిని పొందును తెలియుము పార్థా!

72. ఇట్టిస్థితులను పొందిన యోగులు
మోహముచెందక మెదలుచు నుందురు
చివరి సమయమున స్థిరముగ నుండెడి
బ్రాహ్మీస్థితియే బ్రహ్మానందము

ఇది సాంఖ్య యోగము

## 3. కర్మ యోగము

1. అర్జునుడనియెను జనార్దనునితో
కర్మలకంటెను జ్ఞానముగొప్పని
భావించినచో నన్నునెందులకు
భయయుద్ధమునకు నియోగించెదవు

2. తికమకపెట్టెడి నీమాటలతో
నామనసెంతయు కలవర మొందెను
మంచిని చేసెడి ఒకేమార్గమును
నిశ్చితమతితో తెలుపుము కృష్ణా!

3. కృష్ణుండనియెను పార్థునకప్పుడు
ఈలోకములో రెండేనిష్ఠలు
సాంఖ్యయోగులకు జ్ఞానమార్గమును
కర్మయోగులకు కర్మమార్గమును

4. పనులను చేయక ఫలములనొందడు
యోగసిద్ధులును అతనినిచేరవు
పనులను వదలిన మానవుడెప్పుడు
సాంఖ్యయోగమును పొందగ జాలడు

5. ఎట్టివారలను ఎట్టిసమయముల
క్షణకాలమ్మును పనులను వదలరు
గుణములకనువగు పనులనుచేయుచు
ఎల్లవారలును మెలగుచునుందురు

6. బలవంతమ్మున ఇంద్రియమ్ములను
అదుపుననుంచుచు విషయభోగముల
మనమున తలచు నుండెడిమూఢుడు
దాంభికుండనుచు పిలువబడునులే

7. కావున అర్జున మనసున నెప్పుడు
ఇంద్రియమ్ములను వశముననుంచుచు
ఆశలు వదలుచు పనులను చేసెడి
మానవుడగునులె పురుషశ్రేష్ఠుడు

8. విధియుక్తముగా పనులనుచేయుము
పనులను చేసిన మంచిగనుండును
పనులను చేయక మెలగెడివారల
దేహయాత్రలును బాగుగ సాగవు

9. మంచినిపెంచే పనులను వదలిన
మిగిలిన పనులకు బందీయగుదువు
ఆశను చిక్కక మంచిని పెంచే
విధియగు పనులను చక్కగ చేయుము

10.కల్పము మొదటను బ్రహ్మదేవుడే
మేలుచేయుటకు జన్మలనిచ్చెను
మేలొనరించగ చేసే పనులే
కామధేనువై కోర్కెలు తీర్చును

11.మంచిపనులచే దేవతలెపుడును
తృప్తినిపొందుచు మేలుచేయుదురు
ఒకరికి నొకరును మేలొనరించిన
లాభముపొందుచు సాగుచునుందురు

12.మంచిపనులచే తృప్తిని చెందిన
దేవతలెప్పుడు కోరిక లిత్తురు
పొందిన లాభము పరులకు పంచక
ఉండెడివారలె నిజమగు దొంగలు

13.యజ్ఞము చేయగ మిగిలిన దానిని
పొందెడివారలు పాపము నొందరు
తనకే యంచును తలచుచు మెక్కెడి
వారలకెప్పుడు పాపముకలుగును

14.అన్నమునుండే జీవులు పుట్టును
వానలనుండే అన్నము పుట్టును
యజ్ఞమునుండే వానలు పుట్టును
మనదగు పనులను మంచియు పుట్టును

15.తెలివిడి చేతనె పనులను తెలియుము
తెలివిడి కలుగును బ్రహ్మవలననే
అన్నిచోటులను వదలకచేసెడి
మంచిపనులలో బ్రహ్మముండును

16.అనూచానముగ వచ్చెడిమంచికి
అనుకూలమ్ముగ నుండకపోదలుచు
తనసుఖములనే కోరెడి పాపికి
జీవితమెప్పుడు సఫలతచెందదు

17. ఆత్మానందము పొందెడి మనుజుడు
ఆత్మలోననే తృప్తినిపొందును
ఆత్మను తుష్టిని పొందెడువానికి
విధియుక్తమ్మగు పనులే మిగులవు

18. అట్టి మనుజుడే లోకములందున
చేసెడి పనులకు లాభము కోరడు
చేయకుండినను దోషములంటవు
ప్రాణులతోడను బంధములుండవు

19. కావున నీవును లాభము కోరక
విహిత కర్మలను చక్కగ చేయుము
ఆశకు లొంగక పనులను చేసిన
వాడే క్రమముగ మోక్షమునొందును

20. జనకుడు మొదలగు జ్ఞానులందరును
లాభము కోరక పనులనుచేసిరి
సిద్ధిని పొందిరి కావున నీవును
లోకహితానికి పనులను చేయుము

21.గొప్పవారలై చేసెడి పనులను
అవలంబింతురు పొరుగువారలును
అదే నియమమని తలతురెప్పుడును
సమాచరించును లోకముదానిని

22.కావున పార్థా! నాకునెప్పుడును
లోకములందున పనులేయుండవు
అట్లనినాకును పొందని దుండదు
అన్నిపనులలో నేనేయుందును

23.నేనే పనులను చేయకున్నచో
చిరమగు హానిని లోకములొందును
మనుజులందరును సర్వవిధమ్ముల
నా మార్గమునే అనువర్తింతురు

24.నేనే పనులను చేయకున్నచో
లోకములన్నియు నాశముచెందును
అలజడిచెందును నష్టముపొందును
దానికి నేనే బాధ్యుడనగుదును

25.వినుమో పార్థా! తెలియని వారలు
ఫలములు కోరుచు పనులు చేయుదురు
జ్ఞానులునట్లే లోక హితమ్మును
కోరుచు నెప్పుడు పనులు చేయవలె

26.నిశ్చలభావము కలిగిన జ్ఞానులు
అజ్ఞులనెప్పుడు ప్రోత్సహించవలె
విహితకర్మలను తానును చేయుచు
వారలు చేయగ ప్రోత్సహించవలె

27.నిజము నరయగా కర్మలన్నియును
సహజముగానే జరుగుచునుండును
అహమును పొందిన మూఢులెప్పుడును
కర్తలు తామని భావన సేతురు

28.గుణవిభాగమును కర్మవిభాగపు
తత్త్వముతెలిపిన జ్ఞానియెప్పుడును
గుణములయందే గుణములుండునని
తెలిసియు మోహముపొందక యుండును

29.సహజగుణమ్ముల మోహము పొందిన
గుణకర్మలలో ఇష్టము చూపును
మందబుద్ధులగు నట్టివారలకు
జ్ఞానులెప్పుడును నిజముతెలుపవలె

30.అంతటనుండే నన్నుతెలుసుకొని
అన్నికర్మలను నాకే ఇచ్చుచు
ఆశామమతలు సంతాపములను
వదలుచు నీవే యుద్ధము చేయుము

31.అసూయ లేకయు శ్రద్ధను కలిగియు
శుభము కలుగు నాబాటను నడచిన
వారలందరకు కర్మబంధములు
అంటకనుందును ముక్తియు కలుగును

32.ఆత్మను తెలియక దోషారోపణ
చేయుచు నాయీబాటను వీడెడి
వారలు మూర్ఖులు మూఢులు భ్రష్టులు
కష్టనష్టములు పొందుచు నుందురు

33. ప్రాణులన్నియును తమగుణమ్ములకు
లోబడి కర్మలు చేయుచు నుండును
జ్ఞానియు నటులే చేయుచు నుండును
పట్టుపట్టినను వదలుట కష్టము

34. అన్నివిషయముల రాగము ద్వేషము
కలుగుట సహజము మనుజులందరికి
వానికి లొంగక యుండుట మంచిది
మనుజున కివియే ప్రబల శత్రువులు

35. ఇతరధర్మములు గొప్పనిపించిన
మనధర్మములే ఆచరించవలె
మనధర్మములే మేలును కూర్చును
పరధర్మమ్ములు భయమును గొల్పును

36. అర్జునుడనియెను పరమాత్మునితో
ఇష్టములేకనె పాపపు పనులను
ఇతరులబలిమిని చేయుచుండుటకు
కారణమెయ్యది? తెలుపుము కృష్ణా!

37.రజోగుణమ్మున కలుగును కామము
కామము దాల్చును క్రోధరూపమును
అనుభవించినా తృప్తిని చెందని
పాపశత్రువుల తెలిపెను కృష్ణుడు

38.అగ్గిని పొగలే కమ్మినట్లుగను
అద్దము దుమ్మున కూడినట్లుగను
మావి పిండమును కప్పినట్లుగను
కామము తెలివిని కప్పుచునుండును

39.కామమన్నచో అగ్నికి సమమగు
ఆరుటెనున్నదు దానికి కలుగదు
జ్ఞానులకెప్పుడు నిత్యము శత్రువు
మానవ జ్ఞానము కప్పివేయునది

40.కామ నివాసము నేర్పడజెప్పదు
మనసును, బుద్ధియు, ఇంద్రియమ్ములును
జ్ఞానమునివియే కప్పుచునుండును
జీవుల మోహమునొందగ జేయును

41. ఇంద్రియ వశమును పొందుము పార్థా!
జ్ఞానవిజ్ఞాన నాశమొనర్చెడి
మహాపాపియగు కామమునెప్పుడు
సర్వవిధమ్ముల నోడించుమయా!

42. దేహముకంటెను విషయముగొప్పది
విషయముకంటెను మనసేగొప్పది
మనసులకంటెను బుద్ధేగొప్పది
బుద్ధులకంటెను ఆత్మేగొప్పది

43. బుద్ధులకంటెను ఆత్మయెగొప్పది
సూక్ష్మము బలమును మిక్కిలి శ్రేష్ఠము
మనస్సెప్పుడును బుద్ధికి వశమగు
కామము వీడుము మహాబాహుడా!

ఇది కర్మయోగము

# 4. జ్ఞాన యోగము

1. కృష్ణుండనియెను పార్థునితోడను
నిత్యసత్యమౌ యోగము తెలిపితి
రవికిని, ఆతడు తెలిపెను మనువుకు
అతడును తెలిపెను ఇక్ష్వాకునకును

2. అనూచానముగ వచ్చిన యోగము
ఋషిత్వమొందిన రాజులెరింగిరి
లుప్తమయ్యెనది భూలోకమ్మున
కాలమె దానికి కారణమయ్యెను

3. ఈ యోగమ్మే మిక్కిలి గొప్పది
దాచగ వలయును పురాతనమ్మిది
నీవు భక్తుడవు ప్రియమగు సఖుడవు
తెలియుము ఫల్గుణ తెలిపెద నీకును

4. అర్జునుడనియెను శ్రీకృష్ణునితో
మీకీజన్మము ఇప్పుడుకలిగెను
సూర్యుడు కలడుగ ఆదినుండియును
ఎట్లు తెలిపితివొ నమ్ముట కష్టము

5. వినుమో అర్జున నీకును నాకును
పుట్టుకలెన్నో జరిగెను గతమున
నాకే తెలియును జరిగినదంతయు
నీకు తెలియదులె జరిగినదంతయు

6. పుట్టుకలేకయు నుండెడివాడను
అవ్యయాత్ముడను జనులకు దేవుడ
ప్రకృతి అంతయును వశమున నుండును
యోగమాయచే అవతరించెదను

7. ధర్మమ్మునకూ హాని కలిగినను
అధర్మమెంతయు బాగుగపెరిగిన
జగములనంతయు ధర్మము నిలుపగ
అవతరించెదను ఫల్గుణ నేనే

8. మంచివారలను రక్షించుటకును
చెడ్డవారలను అణచివేయుటకు
ధర్మస్థాపన చేయుటకొరకును
ప్రతియుగమందున అవతరించెదను

9. నాజన్మమ్మును కర్మయుగొప్పవి
తత్త్వము తెలిసిన వారలందరును
దేహమువదలిన వెంబడిపుట్టక
నన్నుచేరుదురు నిజముగ పార్థా!

10. ప్రేమయు భయమును కోపము వదలుచు
నన్నేచేరగ నాశ్రయించుచును
జ్ఞానతపమ్ములు చేసెడి పెక్కురు
పవిత్రులౌదురు నన్ను చేరెదరు

11. నన్నేరీతిగ సేవలు చేసిన
దానికి సరియగు ఫలములనిత్తును
మానవులందరు పరిపరివిధముల
నన్నుచేరెదరు తెలియుము పార్థా!

12. లోకమునందున కర్మలఫలమును
ఆశించుచును వివిధ దేవతల
పూజలు చేసిన వారికి అట్లే
వేగముగానే ఫలములు కలుగును

13.నాల్గువర్ణముల సృష్టిచేసితిని
గుణకర్మములే ఆలంబనగా
దానికి కర్తను నేనేయైనను
వాస్తవమ్ముగా నేనే చేయను

14.కర్మఫలమ్ముల నేనే కోరను
కావున కర్మలు నన్నే తాకవు
నా తత్త్వమ్మును తెలిసిన వారలు
కర్మబంధమున చిక్కరెప్పుడును

15.మోక్షముకోరిన పూర్వులు పార్థా!
తత్త్వమెరింగియు పనులను చేసిరి
కావున నీవును వారలవలెనే
పనులను చేయుము ఫలితముకోరక

16.కర్మాకర్మల భేదము తెలియక
పండితులెందరొ తికమక చెందిరి
కావున తెలిపెద తత్త్వము నీకును
దానిని తెలియుము శుభమును పొందుము

17. కర్మతత్త్వమును తెలియగ వలయును
అకర్మతత్త్వము తెలియగ వలయును
వికర్మతత్త్వము తెలియగ వలయును
కర్మతత్త్వమే నిగూఢమైనది

18. కర్మయందుగల అకర్మ తెలిసియు
అకర్మలోగల కర్మను తెలియుచు
మెలగెడు మనుజుడు బుద్ధిశాలియగు
అతడే యోగియు పనిమంతుండును

19. ఎవనికర్మములు శాస్త్ర సమ్మతము
ఎవనికర్మలను కోరికలుండవు
ఎవనికర్మములు జ్ఞానదగ్ధమగు
పండితుడతని బుధులుపల్కుదురు

20. పనులన్నిటిలో ఫలితములందును
ఇష్టము పెంచక కోరిక నుంచక
నిత్యతృప్తుడై మెలగెడు వానికి
పనులను చేసిన చేయని వాడగు

21.శరీరమనముల నదుపుననుంచుచు
వస్తువులేమియు గ్రహింపకుండను
శరీరకర్మలు మాత్రము చేయుచు
ఆశలు వదలిన పాపము పొందదు

22.కోరిక లేకయు పొందిన ఫలముల
తృప్తిని పొందుచు అసూయవీడిన
ద్వంద్వాతీతుడు సమభావమ్మున
పనులొనరించిన బంధము లొందదు

23.ఇష్టము కోరిక ప్రేమలు వదలుచు
దేవుని మనసున లగ్నము చేయుచు
యజ్ఞకర్మలను చేసెడి వానికి
కర్మలన్నియును విలీనమొందును

24.సాధన బ్రహ్మము ద్రవ్యము బ్రహ్మము
అగ్నియు బ్రహ్మము కర్తయు బ్రహ్మము
హోమము బ్రహ్మము ఫలితము బ్రహ్మము
కర్మస్థితుడగు యోగియు బ్రహ్మము

25. దైవరూపమున పూజలు కొందరు
ఆత్మరూపమునె పరబ్రహ్మగా
అభేద దర్శనమొందుచు మనమున
యజ్ఞము చేయుచునుందురు కొందరు

26. కర్ణము మొదలగు అంగములన్నియు
సంయమాగ్నిలో వేతురు కొందరు
శబ్దము మొదలగు విషయములన్నియు
ఇంద్రియాగ్నిలో వేతురు కొందరు

27. ఇంద్రియ కర్మల ప్రాణకర్మలను
జ్ఞానముతెలిపెడి ఆత్మసంయమన
అగ్నిని వేయుచు హోమము చేయుచు
మెలగెడి యోగులు కొందరు మనుదురు

28. ద్రవ్యయజ్ఞముల తపోయజ్ఞముల
యోగయజ్ఞము అహింసను వదలుచు
వ్రతోయజ్ఞముల జ్ఞానయజ్ఞముల
యత్నము చేయుచు కొందరు నిలుతురు

29.అపానమందున ప్రాణవాయువును
హోమము చేతురు యోగులుకొందరు
ప్రాణమునందున అపానవాయువు
హోమము చేతురు యోగులు కొందరు

30.ఆహారమ్మును తీసుకొనుటలో
గాలిని పీల్చుట వదలుట యందును
నియమములుంచే యోగులు కొందరు
ఈ యజ్ఞమ్ముల పాపము నొందరు

31.యజ్ఞమునందలి పూతామృతమును
పొందే యోగులు దైవములగుదురు
యజ్ఞము చేయక ఇహసుఖమొందరు
పరమును గూర్చిన పలుకులెందులకు

32.వేదములందున పెక్కుయజ్ఞములు
సవిసర్తమ్ముగ తెలియుచునుందును
కర్మజమ్ములని వానిని తెలిసిన
బంధములన్నియు విడివడి పోవును

33. యజ్ఞములందున పరిశీలించిన
ద్రవ్యముకంటెను జ్ఞానముగొప్పది
కర్మలన్నియును జ్ఞానమునందే
మిళితమ్మగునని తెలియు పరంతప!

34. తత్త్వము తెలిసిన జ్ఞానుల చేరియు
కపటము లేకయు భక్తిభావమున
దండము సేవలు చేసిన మెత్తురు
ప్రశ్నలు వేసిన తెలిపెదరన్నియు

35. జ్ఞానమునొందిన మోహమునొందవు
కావున తత్త్వము తెలియుము పార్థా!
సర్వప్రాణుల నీలో చూచిన
సర్వము నాలో చూచినయట్లే

36. ఒకచో నీవే పాపులయందున
గొప్పపాపివని భావన చెందిన
జ్ఞాననౌకచే పాపసంద్రమును
సునాయాసముగ దాటగలవులే

37.మండే నిప్పులు కట్టెల కాల్చును
బూడిద చేయును అదే విధమ్ముగ
జ్ఞానంబనియెడి నిప్పులు పార్థా!
కర్మల కాల్చును బూడిద చేయును

38.తెలివిడి కన్నను పవిత్రమైనది
సమానమైనది ఇలలో లేదుగ
సాధకుడెంతయు సాధన చేసిన
తనలో జ్ఞానము పొందగలడులే

39.శ్రద్ధను కలిగిన ఇంద్రియ విజయుడు
సాధకుడెప్పుడు జ్ఞానమునొందును
జ్ఞానమునొందిన మరుక్షణమ్మున
పరమగు శాంతిని పొందును నిజముగ

40.తెలివిడి లేకయు శ్రద్ధయు లేకయు
అనుమానముతో నాశము చెందే
సంశయాత్మునకు ఇహలోకమ్మున
పరలోకమ్మున సుఖమే యుండదు

41.నియతకర్మలను చేయుచుండుచును
కర్మఫలితముల దేవునికిచ్చుచు
జ్ఞానముచే ననుమానము తీరిన
ఆత్మవంతునకు బంధములంటవు

42.కావున ఫల్గుణ హృదయస్థంబగు
అజ్ఞానమ్మును సంశయమ్ములను
జ్ఞానఖడ్గమున ముక్కలు చేయుచు
యోగమార్గమున యుద్ధము చేయుము

**ఇది జ్ఞాన యోగము**

# 5. కర్మ సన్న్యాస యోగము



1. శ్రీకృష్ణునితో అర్జునుడనియెను
కర్మసన్న్యాసమందువు ఒకపరి
ఒకపరియందువు కర్మయోగమని
రెండిటనేదియొ గొప్పదిచెప్పుము

2. కర్మసన్న్యాస కర్మయోగములు
రెండును మేలును కలిగించునవే
కృష్ణుడు పలికెను మిక్కిలి మంచిది
సాధన సుగమము కర్మయోగమే

3. ఎవరిని తిట్టని దేనిని కోరని
కర్మయోగియే నిత్యసన్న్యాసి
రాగద్వేషముల మనసున వీడిన
సుఖముగ వదలును భవబంధములు

4. సాంఖ్యము కర్మల యోగఫలమ్ములు
వేరను మూర్ఖుడు కాదను చదువరి
రెండిట దేనిని బాగుగసలిపిన
రెండిటి ఫలమును పొందును మనుజుడు

5. జ్ఞానయోగులును కర్మయోగులును
దేవుని చెంతకు చేరుట నిక్కము
ఈ రెండింటిని ఒక్కటిగానే
చూచెడి వాడే నిజమును తెలియును

6. కర్మయోగమును నాచరింపకయు
సన్యాసియగుట మిక్కిలి కష్టము
కర్మయోగియే దేవుని తలచుచు
ఆతనిచేరును మిక్కిలి వడిగా

7. విజితాత్ముండును ఇంద్రియ విజయుడు
విశుద్ధాత్ముడును సర్వజీవముల
ఆత్మలు తనదను కర్మయోగికిని
కర్మలు చేసిన బంధములంటవు

8. తత్త్వ విదుండగు సాంఖ్యయోగియే
పనులనుచేయుచు తానుచేయనని
చూచుచు వినుచును తాకుచు తెలియుచు
తినుచును నడచుచు నిద్రను పొందుచు

9. గాలినిపీల్చుచు వదలుచు పలుకుచు
పొందుచు కనులను మూయుచు తెరచుచు
ఇంద్రియమ్ములే తమపని చేయును
తాను కర్తనని భావన చెందడు

10. కర్మలనన్నియు దేవునకిచ్చుచు
లాభముకోరక పనులను చేసిన
తామరాకుపై నీటిచుక్కవలె
పాపములంటవు వానిని నిజముగ

11. ప్రేమమోహములు మదిలో వీడుచు
అంగమనమ్ములు శరీర బుద్ధుల
ఆత్మశుద్ధికై  కర్మలు చేసిన
కర్మయోగులుగ వారలు మనుదురు

12. పనుల లాభమును వదలెడి వాడే
దేవుండిచ్చిన శాంతిని పొందును
పనుల లాభమును కోరెడి వాడే
కోరికలందున బంధము లొందును

13.మనసును వశమున నుంచుకొనుచును
సాంఖ్యయోగమును నిర్వహించుచును
నవద్వారముల మేనున మనమున
కర్మలు వదలిన సుఖముల నొందును

14.దైవమెన్నడును మానవీయమగు
కర్తల కర్మల ఫలితములందున
బంధమొనర్చడు బంధములన్నియు
ప్రకృతి మూలముగ కలుగుచునుండును

15.అంతటనుండెడి దైవమెప్పుడును
పుణ్యపాపముల బాధ్యతనొందదు
తెలివిని తెలియమి కప్పివేయగా
జీవులు వానికి పూచీయగుదురు

16.తెలియనితనమ్ము ఆత్మతత్త్వమును
తెలియుటతోనే పటాపంచలగు
అట్టి తెలివిడిని గొప్పదైవమే
సూర్యకాంతివలె కనబడజేయును

17. దైవమునందే బుద్ధిని నింపుచు
దైవమునందే మనసును నిలుపుచు
జ్ఞానముపొందియు పాపమువీడియు
మళ్ళీ పుట్టని లోకమొందుదురు

18. జ్ఞానులెప్పుడును పండితులందున
ఆవులయందున ఏనుగులందున
కుక్కలయందున శునకభక్షకుల
సమభావమ్మున మెలగుచునుందురు

19. అన్నిట సమమగు భావము చూపిన
అన్నిటి యందును జయము నొందుదురు
దోషరహితుడగు బ్రహ్మయె సముదను
అట్టివారలే బ్రహ్మను నిలుతురు

20. ప్రియమున పొంగక బాధను క్రుంగక
తిరముగ నుండుచు మోహమునొందక
బ్రహ్మను తెలిసియు చలనములేకయు
ఒకే భావమున పండితుడుండును

21. విషయములందున కోరికలుంచక
సాధనచేయుచు సాత్త్వికభావము
బ్రహ్మయోగమును మనసున పొందిన
ఆనందమ్మును ఆస్వాదించును

22. విషయభోగములు సుఖాభాసములు
దుఃఖహేతువులు నిత్యముకావవి
ఆదిఅంతములు పొసగుచునుండును
పండితుడిష్టము నెఱపడర్జునా!

23. శరీర మిహమును వదలక ముందే
కామక్రోధముల బారిన పడకయు
సహనము కలిగియు మెలగెడినరుడే
నిక్కపు యోగియు నిజమగు సుఖుడును

24. అంతరాత్మలో సుఖమును పొందుచు
ఆత్మానందము నాత్మజ్యోతిగను
మార్చెడియోగియె బ్రహ్మరూపుడై
బ్రహ్మను చేరియు మోక్షమునొందును

25.జ్ఞానమార్గమున అనుమానమ్మును
పారద్రోలుచును పాపముచేయక
అందరిమేలును వదలక కోరిన
బ్రహ్మను కలసిన మోక్షమునొందును

26.కామక్రోధములు వదలిన వారును
మనసు జయించిన ఆత్మను తెలిసిన
యతిగానుండెడి వారలందరును
బ్రహ్మను తెలిసియు మోక్షమొందుదురు

27.విషయ భోగముల పారద్రోలుచును
భ్రూమధ్యమ్మున దృష్టిని నిలుపుచు
గాలిని పీల్చుచు సమముగ వదలుచు
మనసును బుద్ధిని ఇంద్రియమ్ములను

28.జయమార్గమ్మున నడుపుచు మదిలో
మోక్షముకోరుచు మననశీలుడై
భయకోపమ్ములు కోరిక వదలిన
నిజముగనెప్పుడు మోక్షమునొందును

29. యజ్ఞతపమ్ములు దేవునిసొత్తులు
జగములన్నిటికి అతడేయధిపతి
జీవులకలడని తత్త్వము తెలిసిన
శాంతిని పొందును మోక్షమునొందును

ఇది కర్మ సన్న్యాస యోగము

1. కృష్ణుండనియెను ఫలమును కోరక
పనులను చేసిన సన్న్యాసియగును
అగ్నిని వదలిన సన్న్యాసికాదు
పనులను వదలిన యోగిగ మారడు

2. సన్న్యాసంబన యోగంబనగా
ఒకటేయగునని తెలియుము పార్థా!
సంకల్పంబును వదలక నెవడును
యోగిగ కాదని తెలిసికొనుమయా!

3. గొప్పయోగమును పొందెడి మునులకు
కోరిక వదలిన పనులే మూలము
గొప్పయోగమును పొందెడి జనులకు
అన్నికోరికలు వదలుటె మోక్షము

4. భోగము లందున కర్మలయందున
కోరికలుండక మెలగెడి వాడే
ఫలితము కోరక పనులను చేసెడి
మానవుడతడే యోగారూఢుడు

5. ఆత్మనుతానే ఉద్ధరింపవలె
ఆత్మనుతానే దిగుచుటకూడను
తనకును తానే తెలియగ మిత్రుడు
తనకును తానే తెలియగ శత్రువు

6. మనోకాయముల జయమును పొందిన
తనకునుతానే హితునిగ మారును
మనోకాయముల జయమును పొందక
తనకునుతానే రిపునిగమారును

7. వేడియు చలువయు సుఖదుఃఖమ్ముల
మానము నందవమానము నందున
భేదములేకయు మెలగెడివానిని
పరమాత్మందును స్థిరముగ నిలుచును

8. దైవము తెలిసిన యోగుల మనసున
జ్ఞానవిజ్ఞాన ధర్మము తెలియును
మార్పులు లేకయు ఇంద్రియజయమున
మట్టిని పసిడిని సమముగనెంచును

9. ఉత్తమనీచుల శత్రుల మిత్రుల
ఉదాసీనులను మధ్యమార్గులను
ధర్ముల పాపుల బంధువులందున
సమముగ నుండిన శ్రేష్ఠుండనబడు

10. మనసును కాయము వశమున నుంచుచు
ఆశలులేకయు భోగము వదలుచు
ఒంటిగ నుండుచు నేకాంతములో
ఆత్మను దైవము నందున చేర్చుము

11. దర్భలు అజినము వస్త్రములుంచిన
ఎత్తుపల్లములు కాకయు సమముగ
శుచియగు స్థలమున తిరమగు పీటను
ఆసన మొక్కటి నేర్పడ చేయుము

12. ఆసనమందున తిరముగ కూర్చుని
మనసు శరీరము వశమున నుంచుచు
ఏకాగ్రతతో నాత్మశుద్ధిగను
ధ్యానయోగమును సాధన చేయుము

13. కాయము మెడయును తలయును తిరముగ
నిలుపుచు కదలిక లేకయునుండగ
నాసికాగ్రమున చూపును నిలుపుచు
అటునిటు పోవక మనసును ఉంచుము

14. ప్రశాంతమనమున భీతిని చెందక
బ్రహ్మచరించుచు మనోనిగ్రహము
వదలకనెపుడును కదలని భావము
నాపైనుంచిన మేలని యెంచుము

15. మనసును వశమున నుంచేవాడగు
యోగియు ఆత్మను నన్నే తలచుచు
నాలో వెలిగెడి పరమానందవు
గొప్పరూపమును శాంతిని బొందును

16. మిక్కిలి యెక్కువ మెక్కెడి వానికి
నిరాహారునకు నిద్రాహీనుని
ఎప్పుడు నిద్రను పోవువానికిని
యోగసిద్ధులును సిద్ధిని పొందవు

17. ఆహారమ్మున విహార మందున
పనులయందునను మెలకువ నున్నను
కలలో సమముగ మెలిగేవానికి
ధ్యానయోగములు సిద్ధించునులే

18. మనసును పూర్తిగ వశమున నుంచుచు
దైవమునందే దానిని నిలుపుచు
సర్వభోగముల నంటక యుండిన
యోగసిద్ధునిగ పేరుగడించును

19. గాలి లేనిచో దీపపు కాంతులు
నిలకడ నుండెడి రూపము పోలిక
మనసును వశమున నుంచెడి యోగికి
దైవ ధ్యానమున నిలకడ యుండును

20. ధ్యానయోగమున సాధన చేసిన
వశమగు మనమున నందము పొందుచు
దైవ ధ్యానము పూతమొనర్చుచు
దేవుని చూచుచు తుష్టిని పొందును

21.బ్రహ్మానందము మిక్కిలిగొప్పది
పవిత్రబుద్ధికి మాత్రము తెలియును
దానిని పొందే స్థితుడగు యోగియు
దైవ రూపమున లీనము చెందును

22.దైవసన్నిధిని చేరిన వానికి
ఇతర లాభములు మిక్కిలి చిన్నవి
బ్రహ్మానందము పొందిన వానిని
దుఃఖము లేవియు కలవర పరచవు

23.దుఃఖరూపమగు లోక బంధముల
చెదరగొట్టునది దైవ యోగమే
గట్టియోగమును ఉత్సాహమ్మున
దృఢచిత్తముతో సాధన చేయుము

24.సంకల్పమ్మున కలిగే కోర్కెలు
పూర్తిగ వీడుము సర్వవిధమ్ముల
మనోమార్గమున నింద్రియమ్ములను
కట్టడిచేయుచు మెలగుచునుండుము

25.సరియగు విధమున సాధన చేయుచు
ఆనందమ్మును పొందుచు మదిలో
తిరముగనుండుచు దేవునితలచుచు
ఇతర యోచనలు వదలగ వలయును

26.నిలుకడ లేమియు మనసుకు సహజము
విషయములందున విజృంభించును
మనసున కోర్కెలు చేరగనీయక
దైవమునందే నిలుపుచు నుండుము

27.శాంతమనస్కుడు బ్రహ్మభూతుడును
పాపరహితుడును రజోదూరుడగు
అట్టియోగియే లోకములందున
బ్రహ్మానందము పొందుచునుండును

28.పాపరహితుడగు యోగినిత్యమును
దైవమునందే ఆత్మను నిలుపుచు
పరబ్రహ్మమగు దైవతమిచ్చే
అనంతబ్రహ్మానందము పొందును

29. అన్నిటనుండెడి యోగాత్ముండును
సమభావమ్మున చూచెడివాడును
సర్వభూతముల తానేయుండును
సర్వభూతముల తనలోచూచును

30. అన్నిటియందును నన్నే చూచుచు
నాయందన్నియుఃచూచే వానికి
నేను కనబడుదు తెల్లముగానే
నాకున్నతడును కనబడుచుండును

31. అన్నిటియందున ఒకేభావమున
ఆత్మరూపమున నన్నేకొలుచుచు
అట్టియోగియే ఏదిచేసినను
నాయందతడే మెలగుచునుండును

32. అన్నిజీవులను తనవలె చూచుచు
సుఖమునుగానీ దుఃఖముగానీ
సమముగ నెంచుచు మెలగెడివాడే
యోగులయందున గొప్పయోగియగు

33.అర్జునుడనియెను కృష్ణునితోడను
నీవుగ చెప్పిన సమభావమ్మును
యోగమునందలి స్థిరభావమ్మును
చెదరెడి మనసున కనుగొన జాలను

34.చంచలమైనది, మథించు మనసిది
గట్టిగనుండును బలముగనుండును
గాలిని వీచక నాపుటవలెనే
మనోనిగ్రహము కష్టము కృష్ణా!

35.కృష్ణుండనియెను పార్థునితోడను
మనస్సెప్పుడును చంచలమైనదె
సాధనచేసిన వైరాగ్యమ్మున
మనోనిగ్రహము అలవడుచుండును

36.మనసును వశమున నుంచకున్నచో
యోగము నొందుట సాధ్యముకానిది
మనసును వశమున నుంచుకొన్నచో
యోగమునొందుట సాధ్యముకనుగొన

37. అర్జునుడనియెను కృష్ణునితోడను
శ్రద్ధనుకలిగియు నియమము తోడను
సాధన చేసిన మనసు చలించిన
యోగికి గతులేవిధముగ నుండును?

38. దైవమార్గమును వీడిన మూఢుడు
ఇహపరమ్ములను రెంటిని వీడుచు
చెల్లాచెదరగు మబ్బుల పోలిక
నాశముచెందున తెలుపుము కృష్ణా!

39. ఈ నాశంకను శమింపజేయగ
నీవేతగుదువు నిజముగ కృష్ణా
ఇతరులెవ్వరికి శక్యము కానిది
నీవే దీనిని తొలగగజేయుము

40. అట్టిమానవుడు ఇహపరమ్ములను
నాశము చెందదు తెలియుము పార్థా!
ఎప్పుడుచేసెడి శుభకార్యమ్ముల
దుర్గతి పొందదు తెలిపెను కృష్ణుడు

41. యోగభ్రష్టుడును పుణ్యలోకములు
పొందియు నచటనె కాలము గడిపియు
పిదపను పావన సంపద గలిగిన
వారల ఇంటను జన్మము నొందును

42. పుణ్యలోకములు పొందక యున్నను
యోగుల ఇంటనె జన్మమునొందును
ఈలోకమ్మున నిట్లుపుట్టుటయు
దుర్లభతరమని తెలియుము పార్థా!

43. పూర్వజన్మమున సాధన చేసిన
యోగముపొందును అచటను పార్థా!
అట్టియోగమున అధికసాధనను
దేవునిచేరగ జతనము చేయును

44. అవశుండైనను పూర్వయోగమున
దైవమునందే మనసును నిలుపును
జ్ఞానవంతుడై వేదములందున
తెలిపిన కర్మల దాటుచునుండును

45.నిండుమనమ్మున సాధన చేసిన
జన్మలు పొందిన యోగికెప్పుడును
పాపములంటక సిద్ధినిపొందును
అప్పటికప్పుడె ముక్తిని పొందును

46.తాపసి కంటెను యోగియె అధికుడు
జ్ఞానులకంటెను యోగియె అధికుడు
కర్మరికంటెను యోగియె అధికుడు
కావున పార్థా! యోగిగ కమ్మిక

47.శ్రద్ధను కూడియు ఆత్మను నాలో
లగ్నమొనర్చియు స్థిరమగు బుద్ధిని
నన్నేకొలుచుచు మెలగెడు యోగియె
పరమశ్రేష్ఠుడని యెంతును మనమున

ఇది ఆత్మ సంయమ యోగము

## 7. జ్ఞాన విజ్ఞాన యోగము

1. కృష్ణుడు పలికెను, వినుమో పార్థా!
నాపై భక్తిని మనసున నుంచుము
యోగిగ మారుచు నిస్సంశయముగ
సమగ్రరూపుని నన్నే తెలియుము

2. ఈలోకమ్మున దేనిని తెలిసిన
మరియొకజ్ఞానము మిగిలియుండదిక
విజ్ఞానముతో తత్త్వజ్ఞానము
నేనే నీకును పూర్తిగ తెలిపెద

3. వేలమానవుల ఒక్కడుమాత్రమె
నన్ను చేరగను యత్నము చేయును
అట్టి సిద్ధులను ఒక్కడు మాత్రమె
నా తత్త్వమ్మును తెలియగ జాలును

4. భూమియు నీరును గాలియు నిప్పును
ఆకాశమ్మును మనోబుద్ధులును
అహంకారమను ఎనిమిది ప్రకృతులు
నా రూపములని తెలియుము పార్థా!

5. అపరా ప్రకృతని దీనిని యందురు
ఇవియేగాకను పూర్ణజగత్తును
ధరించునట్టిది మరియొకటున్నది
పరాప్రకృతియన అదియును నేనే

6. సర్వభూతముల మూలకారణము
ఈరెండేయని తెలుసుకొనుమయా!
జగత్తంతకును జననమరణములు
చేసెడి వాడను నేనని తెలియుము

7. నన్నుమించినది లోకములందున
వేరొకటేదియు ఉండదు పార్థా!
మణులను కూర్చిన దారమువలెనే
జగములన్నిటికి సూత్రము నేనే

8. జలముల రుచియును వేదోంకారము
సూర్యచంద్రులకు కాంతిని నేనే
పురుషులయందలి పౌరుష భావము
ఆకసమందలి శబ్దమునేనే

9. భూమియందున్ను వాసన నేనే
నిప్పులందున్న తేజమునేనే
జీవులందున్న జీవమునేనే
తాపసులందలి తపమును నేనే

10. సర్వభూతముల ఎప్పటికుండెడి
మూలబీజమును, పార్థా! నేనే
బుద్ధిమంతులకు బుద్ధిని నేనే
తేజోవంతుల తేజమునేనే

11. కామరాగములు వదలిన వారల
బలవంతులలో బలమును నేనే
ప్రాణులయందలి ధర్మయుక్తమగు
కామము నేనే తెలియుము పార్థా!

12. సాత్త్విక రాజస తామస గుణముల
అన్నిటి యందలి మూలమునేనే
మూడుగుణమ్ములు నాయందున్నవి
వాటికి వశుడను కానని తెలియుము

13. జగత్తంతయును కార్యరూపమగు
మూడుగుణమ్ముల మోహమునొందును
త్రిగుణాతీతుడ నాశరహితుడను
తెలియగ జాలదు నన్నీలోకము

14. దైవికమ్ములగు త్రిగుణాత్మకమగు
నాయీమాయలు దాటుట కష్టము
నేనే శరణని మనమున నమ్మెడి
వారీ మాయను దాట సమర్థులు

15. మాయనుచిక్కిన అపహృతజ్ఞానులు
రాక్షసభావము పొందువారలును
అధమమానవులు చెడ్డవారలును
మూఢచిత్తులును నన్ను భజింపరు

16. ఆపదలందున చిక్కిన వారును
తత్త్వజ్ఞానము పొందిన వారును
శుభములు చేసే అర్థకాములును
జ్ఞానులు నలుగురు నన్ను భజింతురు

17.వారలయందున ఏకభావమున
భక్తిని కలిగిన జ్ఞానియె అధికుడు
తత్త్వము తెలిసిన జ్ఞానికి ఇష్టుడ
అతడే నాకును మిక్కిలి ఇష్టుడు

18.వీరలు నలుగురు గొప్పవారలే
ఐనను జ్ఞానియె నారూపంబగు
మనోబుద్ధులను నాపై నుంచుచు
నన్నే పొందును నాలోనుండును

19.అనేకజన్మలు పొందిన పిదపయు
జ్ఞానియెఎరుగును సర్వమునేనని
అట్టిభావమున నన్నే కొలిచెడి
మహాత్ములరుదుగ దొరకుచు నుందురు

20.ఇహభోగమ్ముల పొందగోరుచును
ప్రకృతిని చిక్కిన అపహృతజ్ఞానులు
నియమము వెంబడి బహురూపమ్ముల
ఇతర దేవతల పూజచేయుదురు

21.ఏ కోరికతో నేదైవమ్మును
నిండుమనంబున పూజలు చేయునొ
అట్టి భక్తునకు అట్టిదైవమున
కదలని మనమున భక్తియు కుదురును

22.కోరిక కలిగిన భక్తుడెప్పుడును
అట్టిదైవమునె ఆరాధించును
అదే రూపమున నేనే యిచ్చెడి
ఆతనికోర్కెలు తప్పక తీరును

23.ఇతర దేవతల పూజలు చేయుచు
పొందెడి ఫలములు హరించి పోవును
నాకై పూజలు చేసెడి వారలు
శుభములు పొందుచు నన్ను చేరుదురు

24.ఎప్పటికుందును గొప్పగ నుందును
బుద్ధినశించిన కనబడ కుందును
తెలియని వారలు నన్ను గ్రహింపక
చచ్చుచు పుట్టే వానిగ నెంతురు

25. యోగమాయచే కప్పబడుటచే
ఎల్లవారలకు కనబడ కుందును
జన్మములేదని శాశ్వతుండనని
మూఢులు నన్నే తెలియక నుందురు

26. భూతమునందలి వారల నెరుగుదు
ఇప్పుడు తిరిగెడి వారల నెరుగుదు
భావిని వచ్చే వారల నెరుగుదు
నన్ను నెరుంగని వారల నెరుగుదు

27. లోకములందలి సర్వప్రాణులును
ఇష్టమయిష్టము వలనను కలిగిన
సుఖదుఃఖమ్ముల అనుభవించుచును
వదలని మాయను చిక్కుచునుందురు

28. పుణ్యకార్యముల చేసెడివారికి
పాపములంటవు పుణ్యముచేరును
ద్వంద్వ రూపమగు మాయను విడివడి
గట్టిభావమున నన్ను భజింతురు

29. జననమరణముల విముక్తి కొరకై
నన్నేశరణము కోరెడివారలు
పరబ్రహ్మమును అధ్యాత్మమ్మును
పూర్ణకర్మలను తెలియుచునుందురు

30. అధి భూతమున అధిదైవమున
అధి యజ్ఞమున వసించునన్నును
అవసానమ్మున తెలిసెడి వారలు
నిశ్చయమ్ముగను నన్ను చేరుదురు

**ఇది జ్ఞాన విజ్ఞాన యోగము**

# 8. అక్షర పరబ్రహ్మ యోగము

1. ఓ పురుషోత్తమ! పార్ధుడు పలికెను
ఏది బ్రహ్మము? అధ్యాత్మమేది?
కర్మంబేదియు? అధిభూతమ్మని
అధిదైవమ్మని దేనినియందురు

2. అధియజ్ఞమ్మును తెలుపుముదేవా?
శరీరమందున అదియెట్లుండును
అవసానమ్మున లగ్నమనమ్మున
యోగులు నిన్నే ఎట్లుతెలియుదురు

3. అర్జునుతోడను దైవము పలికెను
అక్షర పరమము బ్రహ్మమనంబడు
ఆత్మతత్త్వమే అధ్యాత్మమగును
జాతవిసర్గలు కర్మయనంబడు

4. కలుగుట చెడుటయు అధిభూతమ్మగు
పురుషోత్తముడే అధిదైవమ్మగు
శరీరమంతట నుండెడినేనే
అధియజ్ఞమ్మని తెలియుము పార్ధా!

5. అవసానమ్మున నన్నేయెంచుచు
వపువును వదలెడివాడే నిజముగ
నన్నేపొందును ఈ విషయమ్మున
సందియమన్నది లేనేలేదులె

6. అవసానమ్మున దేనిని తలచుచు
వపువును వీడునొ అదేపెంపునను
ఎప్పుడు దానిని తలచుచుండుటను
ఆ రూపమునే పొందును జీవుడు

7. ఎప్పుడు నన్నే తలచుచు నుండుము
యుద్ధకార్యమును వదలక చేయుము
మనమున బుద్ధిని నన్నే నిలిపిన
నన్నే చెందుదువన్నది నిజమగు

8. పరిపరివిధముల చింతన చేయక
ధ్యానయోగమున సాధన చేయుచు
ఎప్పుడు దేవుని తలచెడి మనుజుడు
అన్నిట గొప్పగు దైవము చేరును

9. అన్నియు తెలిసిన పురాణ పురుషుడు
అదుపున నుంచెడి సర్వపోషకుడు
అచింత్యరూపుడు సూర్యతేజుడును
అజ్ఞానమణచు దైవము తలచుచు

10.నిజమగు భక్తుడు చివరి సమయమున
యోగబలముచే భ్రూమధ్యమ్మున
ప్రాణము నిలుపుచు మనసున తలచిన
దివ్యరూపుడగు దేవుని చేరును

11.నాశమొందదని తెలిపేజ్ఞానులు
రాగమువదలచు పూనికతోడను
బ్రహ్మచర్యమున యోగులు కోరెడి
పరమ పదమ్మున తెలిపెద పార్థా!

12.సర్వేంద్రియముల అదుపున ఉంచుచు
మనసును మదిలో తిరముగ నుంచుచు
ప్రాణశక్తులను తలపైనుంచుచు
యోగమునందున మునిగి యుండుచును

13.బ్రహ్మరూపమగు ఓంకారమ్మును
పలుకుచు నన్నే చింతన చేయుచు
దేహము వదలుచు వెడలిపోవునో
అతడే పొందును పరమపదమ్మును

14.ఇతర భావనలు మనసున నుంచక
ఎప్పుడునన్నే తలంచుచు నుండెడి
నిత్యయుక్తులకు నిత్యయోగులకు
బహుసులభమ్మున దొరుకుదునర్జున

15.పరమపదమ్మును చేరిన వారలు
నాలోచేరిన గొప్పవారలును
దుఃఖమునిచ్చెడి నాశముచెందెడి
పునర్జన్మమును పొందనె పొందరు

16.బ్రహ్మకు దిగువన నుండెడిలోకము
పొందెడి వారలు తిరుగుచునుందురు
నన్నే చేరిన వారలు పార్థా!
పునర్జన్మమును పొందనె పొందరు

17.బ్రహ్మకు పగలగు వేయి యుగమ్ములు
బ్రహ్మకు రాత్రియె వేయి యుగమ్ములు
ఈ విషయమ్మున తెలిసిన వారలు
కాలతత్త్వమును తెలిసిన వారలు

18.బ్రహ్మకు ఉదయము మొదలవగానే
కదలెడి కదలని భూతములన్నియు
ప్రకృతి ద్వారమున పుట్టుచునుండును
చీకట పడగా లీనము చెందును

19.ప్రాణులన్నియును ప్రకృతి వశమ్మున
మాటి మాటికిని పుట్టుచునుండును
చీకటి పడగా కనబడకుండును
ఉదయముకాగా పుట్టుచునుండును

20.ప్రకృతికంటెనూ మిక్కిలిగొప్పది
శాశ్వతమైనది పరమపదమ్మది
సర్వభూతములు నశించుచున్నను
నాశముచెందని పరబ్రహ్మమది

21.కనబడకుండెడి నశింపకుండెడి
చేరవలసినది పరమపదమ్మును
పరమధామమును చేరిన వారలు
వెనుకకు వచ్చుట జరుగనె జరుగదు

22.సర్వభూతములు బ్రహ్మను ఉండును
జగత్తంతయును బ్రహ్మను ఉండును
పరబ్రహ్మమును చేరెడి మార్గము
గొప్పభక్తిగా తెలియము పార్థా!

23.దేహము వదలిన పిమ్మట యోగులు
పునర్జన్మమును పొందని విధమును
జన్మముపొందెడి వారల విధమును
రెంటిని గూర్చియు తెలిపెద నర్జున

24.బ్రహ్మము తెలిసిన వారలెప్పుడును
నిప్పును వెలుతురు పగలును ఎంచగ
శుక్లపక్షమును ఉత్తరాయణపు
మార్గములందున బ్రహ్మచేరుదరు

25.కామయోగులగు వారలెప్పుడును
దూమము రాత్రియు కృష్ణపక్షమును
దక్షిణాయనపు మార్గములందున
స్వర్గము చేరియు తిరిగి వచ్చెదరు

26. శుక్లకృష్ణమను దారులు రెండును
లోకమునందున కనబడుచుండును
మొదటి దారిలో బ్రహ్మను చేరును
రెండవ దారిన తిరిగియు పుట్టును

27.రెండు మార్గముల తత్త్వము తెలిసిన
యోగి మోహితుడు కాలేదర్జున!
సర్వకాలముల యోగము తెలియుచు
నన్నేచెందెడి యత్నము చేయుము

28.దీనిని తెలిసిన, వేదము చదివిన
యజ్ఞము దానము తపమును చేసిన
పుణ్యముకంటెను గొప్పగ వెలిగెడి
పరమపదమ్మును యోగియె పొందును

ఇది అక్షర పరబ్రహ్మ యోగము

# 9. రాజవిద్యా రాజగుహ్యా యోగము

1. పార్థునకప్పుడు కృష్ణుడు పలికెను
దుఃఖము విడివడ మోక్షమునిచ్చే
పరమ గుహ్యమగు జ్ఞాన విజ్ఞాన
రహస్యమంతయు నీకుతెలిపెదను

2. రాజవిద్యగా రాజగుహ్యమగు
పవిత్రమైనది ఉత్తమమైనది
ఫలమునిచ్చునది ధర్మసాధనము
సుఖమునిచ్చునది శాశ్వతమైనది

3. ధర్మమార్గమును నమ్మని వారలు
నన్నును చేరరు వినుము పరంతప!
పుట్టుకచావుల భవచక్రమ్మున
తిరుగుచునుందురు విడివడ కుందురు

4. రూపములేకయె నుండెడివాడను
లోకములంతట నుండెడి వాడను
భూతములన్నియు నాలో నున్నవి
నిజముగ నేనే వాటిలో నుండను

5. నాలో ప్రాణులు స్థిరముగ నుండవు
నాలో చూడుము ఈశ్వరయోగము
ప్రాణులపుట్టుక పోషణభారము
నాదేయైనను వాటిలొ నుండను

6. ఆకసమ్ములో పుట్టిన వాయువు
ఆకసమందే తిరుగుచునుండును
నాచే పుట్టిన ప్రాణులన్నియును
నాలో కలవని తెలియుము పార్థా!

7. ప్రళయకాలమున భూతములన్నియు
నిజముగ నాలో లీనము చెందును
మరలను వాటిని సృష్టి మొదటలో
పుట్టించెదనని తెలియుము పార్థా!

8. వశమునెరుంగని భూతములన్నియు
తమకే తెలియని మాయలో చిక్కగ
నాదగు ప్రకృతికి తగిన విధముగను
సృష్టి చేయుదును మాటి మాటికిని

9. అట్టిపనులలో కామన నుంచక
ఉదాసీనునిగ ఉండే నన్నును
అట్టి కర్మములు బంధింపవనియు
నీవును బాగుగ తెలియుము పార్థా!

10. అధ్యక్షుడనగు నాచేతలతో
జగత్తంతయును పుట్టుచునుండును
అందుచేతనే సంసారంబను
చక్రము తిరుగును తెలియుము పార్థా!

11. నా మహిమమ్ముల తెలియని మూఢులు
సర్వభూతముల కధినాథుడనై
మానవ రూపము పొందిన నన్నే
తెలియక తక్కువ చేయుచునుందురు

12. పనికిరానివగు కోర్కెలు, పనులును
పనికిరానిదగు తెలివియు గల్గిన
రాక్షస, ఆసురి, మోహిని భావము
సహజ సిద్ధముగ పొందుచునుందురు

13.దేవునినమ్మే మహాత్ములందరు
సర్వజీవులకు మూలకారణము
నాశములేకయు ఉండెడి నన్నే
తెలిసియు భక్తిని సంసేవింతురు

14.గట్టివారలగు నట్టి భక్తులే
నన్నేపాడుచు నన్నే చేరగ
నాకే మ్రొక్కుచు నన్నే తలచుచు
నాకే భక్తిని సేవలు చేతురు

15.జ్ఞానయజ్ఞమున యోగులు కొందరు
ఏకభావమున ఉపాసించెదరు
అనంత రూపము లొప్పెడినన్నును
అనంత విధముల ఆరాధింతురు

16.క్రతువును నేనే యజ్ఞమునేనే
స్వధయును నేనే మందును నేనే
యంత్రము నేనే నేతిని నేనే
అగ్నిని నేనే హోమము నేనే

17.తాతను నేనే ధాతను నేనే
తల్లియు నేనే తండ్రియు నేనే
వేద్యము పూతము ఓంకారమ్మును
ఋగ్యజుస్సామ వేదమునేనే

18.గతియును భర్తయు ప్రభువును సాక్షియు
వాసము శరణము శుభమును నేనే
పుట్టుట, పెరుగుట చావుకు మూలము
పెన్నిధి నిజమగు బీజము నేనే

19.నీటిని పీల్చే సూర్యతాపమును
నీటిని నింపే వానలు నేనే
అమృతము నేనే మరణము నేనే
సత్తునసత్తును కూడా నేనే

20.వేదము చదివియు యజ్ఞము చేసియు
పాపముతొలగియు స్వర్గము కోరియు
పుణ్యఫలమ్మున స్వర్గము పొందియు
దేవభోగముల అనుభవించుదురు

21.పుణ్యఫలమ్ములు తీరిపోగనే
తిరిగి చేరుదురు మానవలోకము
దివికిని భువికిని రాకపోకడలు
చేయుచునుందురు కామభోగముల

22.భక్తిభావమున నన్నే తలచుచు
కోర్కెలుకోరక సేవలు చేసెడి
వారికెప్పుడును యోగకుశలములు
వహించువాడను నేనే నేనే

23.కోర్కెలు కోరుచు ఇతర దేవతల
భక్తిమార్గమున పూజలొనర్చిన
నన్నేచెందిన విధియుక్తమ్మగు
మార్గము కాదని తెలియుము పార్థా!

24.సకల యజ్ఞముల భోక్తను నేనే
స్వామిని నేనే ప్రభువును నేనే
ఆత్మ తత్త్వమును తెలియని వారలు
పుట్టుక చావులు పొందుచు నుందురు

25.దేవుని పూజలు దేవుని చేరును
పితరుల పూజలు పితరుల చేరును
భూత పూజలును భూతము చేరును
నా పూజలచే మోక్షము తథ్యము

26.నిర్మలబుద్ధిని కోర్కెలు లేకయు
భక్తిని ఇచ్చెడి ఆకులు పూవులు
పండ్లను నీటిని నేనే పొందియు
మిక్కిలి ప్రీతిగ ఆరగించెదను

27.వినుమో పార్థా! నీవు ప్రీతిచే
చేసెడి పనులును యజ్ఞహవ్యములు
తినెడి భోజనము ఇచ్చెడి దానము
చేసే తపమును నాకర్పింపుము

28.సన్యాసమ్మున తిరముగ నుండుచు
కర్మఫలమ్ముల నాకర్పించిన
శుభాశుభమ్ముల బంధమునుండియు
ముక్తిని పొందుచు నన్ను చేరెదవు

29.అన్నిభూతములు నాకు సమానము
ఇష్టాయిష్టుల భేదము నెంచను
భక్తిభజించిన నాలోనుందురు
నేనును వారల నిజముగ నుందును

30.దురాచారముల లోనైయున్నను
మిక్కిలి భక్తిని నన్ను భజించిన
మంచివానిగనె నేనుతలంతును
అతడే నిజముగ నిశ్చయరూపుడు

31.అతడే తప్పక మంచివాడగును
శాశ్వతంబుగను శాంతిని బొందును
కష్టముపొందడు నష్టము చెంధడు
ఇదియే నిజమని తెలియము పార్థా!

32.ఎట్టిజన్మమును పొందిన గానీ
పురుషులు స్త్రీలును సర్వజీవములు
నన్నే నమ్మిన శరణము కోరిన
ఉత్తమ గతులను పొందుదురర్జున

33.పుణ్యము నెరిగిన బ్రహ్మను తెలిసిన
వారలు ఋషులును భక్తులందరును
నన్ను చేరుదురు, నిత్యము నెరిగియు
ఈలోకమ్మున నన్ను భజింపుము

34.నన్నే తలచుచు నా భక్తుడవై
సేవలు చేయుచు నన్నేకొలువుము
నన్నే నమ్ముచు ఆత్మను నిలిపిన
నన్నే చేరుదు వన్నది నిక్కము

ఇది రాజవిద్యా రాజగుహ్య యోగము

## 10. విభూతి యోగము

1. కృష్ణుండనియెను వినుమో పార్థా!
నాపై ప్రేమను చూపే నీకును
ఎవరికి తెలియని మహిమలు కలిగిన
మేలొనరించే మాటలు చెప్పెద

2. నా జన్మంబుల లీలల నెప్పుడు
ఋషులు దేవతలు ఎరుంగ జాలరు
కారణమేమన సర్వవిధమ్ముల
ఋషుల దేవతల మూలమునేనే

3. నాకు నిజమ్ముగ పుట్టుకలేదని
ఆదియులేదని సర్వలోకముల
ఈశుడ నేనని తెలిసిన జ్ఞానియె
పాపములేకయు ముక్తిని పొందును

4. బుద్ధియు తెలివియు మోహము లేకయు
ఓర్పును నిజమును దమమును శమమును
సుఖదుఃఖమ్ములు పుట్టుక నాశమ్ము
భయమును పొందుట వీడుటన్నియును

5. బాధలుపొందక సమముగ నుంటయు
సంతోషమ్మును తపమొన రించుట
దానము చేయుట కీర్త్యపకీర్తులు
భావములన్నియు నాచే కలుగును

6. సప్తమహర్షులు వారి పూర్వులును
మనువులందరును నాకే భక్తులు
నామనమందున పుట్టిన వారలు
జగమున ప్రజలకు వీరే మూలము

7. నా సంపదలను నిజముగ తెలిసియు
యోగశక్తులను నిజముగ నెరిగిన
వారలందరును నిజమగు భక్తులు
అనుమానమ్మును నిజముగ వదలుము

8. ప్రాణులన్నిటికి నేనే మూలము
జీవములన్నియు నాచే నడుచును
బుద్ధిమంతులే తెలియుదురింతయు
భక్తిభావమున నన్ను కొలిచెదరు

9. తమ జీవితములు నాకర్పించియు
నా మహిమమ్ముల చర్చలు చేయుచు
కథలు చెప్పుచును తుష్టిని పొందుచు
నాలో నుండుచు ఆనందింతురు

10. ఎప్పుడు నన్నే మదిలో తలచుచు
ప్రేమను నన్నే కొలుచువారికిని
బుద్ధియోగమును తెలియగ నిచ్చెద
దానిచె వారలు నన్ను పొందుదురు

11. వారి మనమ్మున స్థిరముగ నుండుచు
వారికి మేలును కలిగించుటకై
వెలుగులం నింపుచు జ్ఞాన దీపమున
అజ్ఞానమ్మును తరిమివేయుదును

12. పార్థుడు పలికెను పరమబ్రహ్మవు
పరంధాముడవు పూతరూపుడవు
సనాతనుండవు దివ్యపురుషుడవు
అజుడవు విభుడవు ఆదిదేవుడవు

13. ఋషులందరును నిన్నుపొగడెదరు
దేవ మునీంద్రుడు నారద మౌనియు
అసిత దేవతలు వ్యాస మహర్షియు
నిన్ను నుతింపగ నాకు తెలిపితివి

14. నీవు తెలుపునది నిజమే కేశవ!
నీ మహిమంజుల నీదు లీలలను
తెలియగ జాలరు దేవదానవులు
తెలియుచునుంటిని నిజముగ కృష్ణా!

15. జగతికి మూలఘు నీవే కావా
సర్వజీవముల నీవే ఉందువు
దేవ దేవుడవు జగన్నాథుడవు
తత్త్వము తెలిసిన వాడవు నీవే.

16. లోకములన్నిట నీ సంపదలే
లోకములన్నియు నీ రూపములే
అన్ని మహిమలను దివ్య సంపదల
పూర్తిగ తెలుపగ నీవే తగుదువు

17. ఎప్పుడు నిన్నే మదిలో తలచుచు
ఎట్లెరుంగుదును నిన్నే కృష్ణా!
ఎట్టి భావముల నిన్ను తలచెదను
తెలియగ జేయుము నాకును కృష్ణా!

18. ఆత్మను నుండెడి యోగ శక్తులును
భూతి వైభవము తెలుపుము కృష్ణా!
ఎంత వినిననూ తృప్తియె కలుగదు
అమృత వాక్యములు పలుకుము కృష్ణా!

19. కృష్ణుండనియెను పార్థుని తోడను
నా విభూతులే అంతట నుండును
ముఖ్యములైనవి కొన్నిటి మాత్రము
వివరణతోడను నీకు తెలిపెదను

20. అన్ని జీవముల లోపలనుండెడి
ఆత్మను నేనే తెలియుము పార్థా!
సర్వభూతముల ఆదియు నేనే
మధ్యను నేనే అంతము నేనే

21. ఆదిత్యులలో విష్ణువు నేనే
జ్యోతులయందున సూర్యుడ నేనే
వాయుదేవతల మరీచి నేనే
చుక్కల రేడగు చంద్రుడ నేనే

22. వేదములందున సామము నేనే
దేవతలందున ఇంద్రుడ నేనే
అంగములందున మనసును నేనే
ప్రాణులయందలి శక్తిని నేనే

23. రుద్రులయందున శంభుడ నేనే
యక్షరాక్షసుల కుబేర రూపుడ
వసువులయందున అగ్నిని నేనే
కొండలయందున మేరువు నేనే

24. పురోహితులలో గురుడను నేనే
సేనానులలో స్కందుడ నేనే
జలాశయమ్ముల సంద్రము నేనే
ముఖ్యుడ నేనే తెలియుము పార్థా!

25.మహర్షులందున భృగువును నేనే
శబ్దాక్షరముల ఓంకారమ్మును
యజ్ఞములందున జపమును నేనే
కదలని రూపుల హిమాద్రి నేనే

26.వృక్షములందున రావిని నేనే
దేవమునులలో నారదుండను
గంధర్వులలో చిత్రరథుండను
సిద్ధులలోపల కపిలమహర్షిని

27.అమృతముతోడుగ జన్మమునొందిన
అశ్వములందున ఉచ్ఛైశ్రవమును
ఏనుగులందున ఐరావతమును
మానవులందున రాజును నేనే

28.ఆయుధాలలో వజ్రాయుధమును
పాడియావులను కామధేనువును
సంతుల నిచ్చెడి కాముడ నేనే
సర్పములందున వాసుకి నేనే

29.నాగులయందున ఆదిశేషుడను
జలదేవతలను వరుణదేవుడను
పితరులయందున అర్యుడ నేనే
శాసకులందున యముడను నేనే

30.అసురుల నెన్నగ ప్రహ్లాదుండను
గణకుల నెన్నగ కాలము నేనే
మృగముల నెన్నగ సింహము నేనే
పక్షుల నెన్నగ గరుడుడ నేనే

31.వేగ గమనమున వాయువు నేనే
ఆయుధ ధారుల రాముడ నేనే
జలచరమ్ములను మొసలిని నేనే
నదుల నెన్నగను గంగను నేనే

32.సృష్టికారణము ఆదియు నేనే
మధ్యను నేనే అంతము నేనే
విద్యలయం దధ్యాత్మను నేనే
వాదుల యందలి వాదము నేనే

33. అక్షరాలలో అత్వము నేనే
సమాసాలలో ద్వంద్వము నేనే
నాశమునొందని కాలమునేనే
విశ్వముఖుండగు బ్రహ్మను నేనే

34. ప్రాణముతీసే మృత్యువు నేనే
పుట్టుకలన్నిట హేతువు నేనే
స్త్రీలను కీర్తిని, లక్ష్మిని మాటను
ఓర్పును తెలివియు ధైర్యము నేనే

35. సామగానమున బృహత్సామమును
ఛందములందున వరగాయత్రిని
మాసములందున మార్గశీర్షమును
ఋతువులయందున వసంతర్తుడను

36. వంచకులందున జూదము నేనే
కాంతివంతులను తేజము నేనే
జతనములందున జయమును నేనే
మంచి వారలకు మంచిని నేనే

37.వృష్ణివంశమున వాసుదేవుడను
పాండవులందున ధనంజయుండను
మౌనులయందున వేదవ్యాసుడ
కవులను పేర్కొన శుక్రుడ నేనే

38.శిక్షించుటలో దండము నేనే
విజయులయందలి నీతిని నేనే
గోప్యవిషయమున మౌనము నేనే
జ్ఞానులయందలి తత్త్వము నేనే

39.కదలని కదలెడి సర్వభూతముల
కారణబీజము నేనే నేనే
నేను లేనిదే ప్రాణులు తిరుగవు
ఈ విషయమ్మును తెలియుము పార్థా!

40.నా మహిమమ్ములు దివ్యములైనవి
అంతము లేనివి నా విభూతులును
శక్తులరూపము కొలదిగ తెలిపితి
ఈ విషయమ్మును తెలియుము పార్థా!

41. సంపదతోడను కాంతిని పొందుచు
శక్తిని కలిగిన వస్తువులన్నియు
నాదగు తేజోరూపమునం దొక
భాగంబనుచును తెలియుము పార్థా!

42. ఇంకా యెక్కువ తెలియు టెందులకు
నీకును లాభము కలుగదు పార్థా!
లోకములన్నియు యోగశక్తిలో
ఒక్కభాగమున ధరియింతునయా!

ఇది విభూతి యోగము

# 11. విశ్వరూప దర్శన యోగము

1. ఓ శ్రీకృష్ణా! పార్థుడు పలికెను
నాపై దయతో మిక్కిలి గొప్పది
రహస్యమైనది అధ్యాత్మమ్మను
విద్యను తెలుపగ మోహము తొలగెను

2. ఓ శ్రీకృష్ణా! సర్వభూతముల
పుట్టుక నాశము బాగుగ వింటిని
ఎప్పటికుండే నీ మహిమలనూ
పూర్తిగ వింటిని బాగుగ వింటిని

3. నీవు చెప్పినది అంతయు నిజమే
ఓ శ్రీకృష్ణా! సంపన్నంబగు
అంతట నిండిన దైవ రూపమును
కన్నుల చూడగ వేడుక నుంటిని

4. ఓ యోగేశ్వర! నీ నిజరూపము
చూచే అర్హత నాకును కలదని
నీకనిపించిన  ఎప్పటికుండే
విశ్వరూపమును చూపుము కృష్ణా!

5. భగవంతుండనె పార్థుని తోడను
వేనకు వేలును నానావిధముల
నానారంగుల నానారకముల
దివ్యమైన నా రూపము చూడుము

6. ఆదిత్యులనూ అష్టవసువులను
రుద్రుల అశ్విని మరుత్తులందర
అచ్చెరువందెడి ఎన్నడుచూడని
రూపములన్నియు చూడుము పార్థా!

7. ఒక్క దేహమున నాలో మెదిలే
లోకములన్నియు చూడుము పార్థా!
చూడగ గోరిన వానినన్నిటిని
నాలో నిజముగ చూడుము పార్థా!

8. నీవీ కన్నుల నారూపమ్మును
నిజముగ అంతయు చూడగజాలవు
యోగశక్తిచే గొప్ప కన్నులను
తేరియు చూడగ నీకు ఇచ్చెదను

9. సంజయుడనియెను ధృతరాష్ట్రునితో
యోగేశ్వరుడును పరమాత్ముండగు
కృష్ణుడు చూపెను పార్థుని కొరకై
విశ్వరూపమును వినుమో రాజా!

10.అనేక ముఖములు కన్నులనేకము
అచ్చెరువొందే రూపములెన్నో
అబ్బురపరచే ఆభరణమ్ములు
చేతను పట్టిన శస్త్రములెన్నో

11.పూలదండలును దివ్య వస్త్రములు
చందన గంధము నిండుగ నుండెడి
అన్నిట నిండిన ముఖకాంతులతో
అనంతరూపము లద్భుతమైనవి

12.లక్షలు కోట్లుగ సూర్యులందరును
ఒకచో చేరిన ఎంత కాంతియో
దానికి నెక్కువ కాంతులుగలిగిన
విశ్వరూపమున ఒదిగిన కాంతులు

13.అనేక విధముల విడివడియుండే
లోకములన్నియు నొకచో చేరిన
దేవాధిదేవు దేహమునందే
విశ్వరూపమును చూచెను పార్థుడు

14.అద్భుతరూపము విశ్వరూపమును
చూచిన పార్థుడు విస్మయమొందెను
పులకితుడయ్యెను మ్రొక్కెను భక్తిని
నమస్కరించెను ఇట్లనిపలికెను

15.అర్జునుడనియెను దేవా! నీలో
ప్రాణులన్నిటిని సకలదేవతల
బ్రహ్మను శంకరు ఋషులనందరిని
దివ్య సర్పముల చూచుచునుంటిని

16.విశ్వరూపుడా! నీచేతులునూ
ఉదరము ముఖములు ఎన్నో కన్నులు
మొదలును మధ్యను చివరను తెలియక
దివ్యరూపమును చూచుచునుంటిని

17.గద కిరీటముల చక్రము నొందియు
కాంతులంతటను నింపే నిన్నును
మండే అగ్నిగ సూర్యుని వెలుగుగ
పోలిక లేకయు గొప్పగ చూచుదు

18.అక్షర రూపపు పరమాత్ముండవు
అందరికీవే దిక్కుగ నుందువు
ధర్మరక్షణను చేసెడి వాడవు
సనాతనుడవని నమ్మెద నేనే.

19.మొదలును మధ్యను చివరలు లేకయు
శక్తిమంతుడవు బహుబాహుండవు
చంద్రుడు సూర్యుడు కన్నులు కాగా
విశ్వతేజమును నీలో చూతును

20.మహాత్మ నీలో దివియును భువియును
అన్నిలోకములు నిండుగ నున్నవి
నీలో చూచిన ఉగ్రరూపమున
లోకములన్నియు గడగడలాడును

21. దేవతలందరు నీలో చేరియు
భయమున నీకే నమస్కరించియు
నీ గుణకీర్తన శుభవచనమ్ముల
నిన్ను పొగడుదురు ఋషులు సిద్ధులును

22. రుద్రులు సూర్యులు వసువులు సాధ్యులు
విశ్వదేవతలు ఆశ్వినేయులును
పితరులు సిద్ధులు యక్షులు సురలును
అచ్చెరువందుచు నిన్ను చూచెదరు

23. ఎన్నోముఖములు కన్నులు చేతులు
తొడలు పాదములు కడుపుయు కోరలు
భయమును గొలిపే రూపము చూచియు
నాతో నందరు వణకుచు నుంటిమి

24. నీరూపమ్మా కాశము నంటెను
రంగులు కాంతులు నీలో నున్నవి
కాంతుల కన్నులు వెడదగు ముఖమును
చూచిన నేనే ధైర్యము వీడితి

25.జగన్నివాసా! నీ కోరలునూ
నీముఖములునూ భీతిని గొల్పెను
అందుకు నేనే కలవర మొందితి
శాంతిని శుభమును కలుగగ జేయుము

26.కౌరవులందరు ఇతరరాజులును
కూడియు నీలో చేరుచునుండిరి
భీష్ముడు ద్రోణుడు కర్ణుడు మొదలగు
యోధులందరును మన వారందరు

27.కోరలు కూడిన నీ ముఖాలలో
చేరగ పరుగులు పెట్టుచు నుండిరి
కోరలమధ్యను దంతములందున
చిక్కియు బాధలు పొందుచునుండిరి

28.నదీనదమ్ములు పరుగులు పెట్టుచు
సంద్రమునందున చేరు విధమ్మున
వీరలు వీరులు మండుచునుండెడి
నీ ముఖమందున చేరుచునుండిరి

29. మిడుతలు భ్రమచే మండెడి మంటను
కోరిక మీరగ చేరి నశించును
అట్లే వీరును నాశమొందగను
నీ ముఖమందున చేరుచునుండిరి

30. దేవా నీవీముఖములతోడను
అన్నిలోకముల మ్రింగుచునుంటివి
భయమును గొల్పెడి నీ తేజమ్మే
అంతట నిండియు మంటలు రేపెను

31. దేవా! నీకే నమస్కరింతును
దయ చూపింపుము భయమును గొల్పెడి
నీవెవ్వరివో తెలియగ చెప్పుము
ఆది దేవుడవు తెలియగ గోరితి

32. భగవానుడనెను లోకములన్నియు
రూపుమాపగను వెలసిన యముడను
యుద్ధముచేయక నీవుండిననూ
వీరలెవ్వరును మిగులరు భువిలో

33.కావున లెమ్మో విజయో! నీవే
శత్రుల చంపుము కీర్తిని పొందుము
సుఖభోగమ్ముల రాజ్యము నేలుము
నిమిత్తముండుము వీరుగతించిరి

34.భీష్ముడు ద్రోణుడః సైంధవ కర్ణులు
ఇంతకు ముందే సమసిరి నాచే
భయమును వదలుము వీరిని చంపుము
యుద్ధముచేసిన విజయము నీదే

35.సంజయుడనియెను ధృతరాష్ట్రునితో
కృష్ణునిమాటలు వినిన పార్థుడును
వణకెడి చేతుల దండమొనర్చెను
తడబడ మ్రొక్కుచు కృష్ణుని పొగడెను

36.అర్జునుడనియెను శ్రీకృష్ణునితో
ఆనందమ్మున నిన్నేపొగడుచు
జగమ్ములన్నియు పొంగుచునున్నవి
అసురులు పారిరి సిద్ధులు మ్రొక్కిరి

37.మహాత్మ! నీవే సర్వశ్రేష్ఠుడవు
సృష్టిని చేసే బ్రహ్మకు తండ్రివి
సత్తునసత్తును సర్వమునీవే
అక్షరుండవగు నీకే ప్రణతులు

38.అనంతరూపా! ఆదిదేవుడవు
పురాణపురుషా! జగదాశ్రయుడవు
అన్నియుతెలిసిన పరంధాముడవు
లోకములన్నియు నీతోనిండెను

39.గాలివి అగ్నివి జలమును యముడవు
చంద్రుడు బ్రహ్మవు వానికి తండ్రివి
వేనకువేలగు నమస్కారములు
నమస్కారములు నమస్కారములు

40.అనంతవీర్యా! అమిత విక్రమా!
లోకములంతట నీవే యుంటివి
అన్ని రూపములు నీవే కాగా
అంతట నీకే నమస్కారములు

41.నిన్నే ఎరుగక మహిమలు తెలియక
ఆలోచింపక తొందరపాటున
కృష్ణా ! యాదవ! సఖుడా యంచును
చనవున పిలిచితి మన్నింపుమయా!

42.తిరిగిన పండిన కూర్చుని తినినను
ఒంటిగ నున్నను మిత్రులమధ్యను
నవ్వుటాలకై మేలము లాడితి
తప్పులన్నిటిని మన్నింపుమయా!

43.శక్తిమంతుడా! సృష్టికంతకును
నీవేతండ్రివి పూజనీయుడవు
గురుడవు దిట్టవు లోకములందున
నీతో సరియగు సమానులేరీ!

44.కావున దేవా! నీకే మ్రొక్కుదు
తండ్రి కుమారుని, మిత్రుడు మిత్రుని
భర్తయు భార్యను బ్రోచే విధమున
కరుణ చూపుమని వేడెద నిన్నే

45.ఎన్నడు చూడని రూపము గాంచితి
అచ్చెరువందితి సంతసించితిని
భయమును చెందితి కావున దేవా
కృష్ణరూపమున ప్రసన్నమగుమా!

46.గదకిరీటములు శంఖచక్రములు
ధరించువానిగ మారుముదేవా!
వేయిభుజమ్ముల విశ్వరూపుడవు
నాలుగు చేతుల కనిపించుమయా!

47.భగవానుండనె పార్థుని తోడను
ప్రసన్నత్వమున యోగశక్తిచే
విశ్వరూపమును చూపితి నీకై
మునుపెవ్వరునూ దీనిని చూడరు

48.వేదము చదివిన యజ్ఞము చేసిన
దానతపములను పుణ్యకర్మలను
మానవులెవరును చూడలేనిదగు
విశ్వరూపమును నీవు చూచితివి

49. భయమును గొల్పెడి రూపము చూచియు
కలతను చెందకు బాధను పొందకు
భయమును వీడియు ఎప్పటివలెనే
పూర్వరూపమును బాగుగ చూడము

50. సంజయుడనియెను ధృతరాష్ట్రునితో
అర్జునుతోడను పలికిన విధమున
కృష్ణుడు పొందెను పూర్వరూపమును
భయపడు క్రీడికి ధైర్యము చెప్పెను

51. అర్జునుడనియెను శ్రీకృష్ణునితో
ఈ నీరూపము బాగుగ నున్నది
ఈనా డెందము కుదుటను బడినది
ఎప్పటి వలెనే మసలుచు నుంటిని

52. కృష్ణుండనియెను పార్థునితోడను
ఇతరులెవ్వరును చూడగలేనిది
విశ్వరూపమును చూచుటకొరకై
దేవతలందరు నిరీక్షించుదురు

53.నీవే చూచిన నారూపమ్మును
వేదము చదివిన తపమొనరించిన
దానము లిచ్చిన యజ్ఞముచేసిన
చూచుట జరుగదు చూచుట కలుగదు

54.ఓయి పరంతప! అర్జున! వినుమా
ఈ నారూపము గొప్పభక్తిచే
తెలియగ తగుదురు చూడగ తగుదురు
నిజముగ నట్లే చేరగ తగుదురు

55.కర్మఫలితమును నాకే ఇచ్చుచు
భక్తిశ్రద్ధలను నాపై నుంచుచు
కోరిక లేకయు ద్వేషము వదలిన
భక్తులు మాత్రమే నన్ను చేరుదురు

ఇది విశ్వరూప దర్శనయోగము

## 12. భక్తి యోగము

1. అర్జునుడనియెను ఓ శ్రీకృష్ణా!
భక్తిని పూజలు చేసే వారిలో
మానస ధ్యానముచేసే వారిలో
నిజమగు యోగులు ఎవరో తెలుపుము

2. ఒకే భావమున నన్నే తలచుచు
భజనలు చేయుచు పూజలు చేయుచు
భక్తిశ్రద్ధల ఆరాధించిన
వారే యోగులు తెలిపెను కృష్ణుడు

3. శాశ్వతుండును గొప్పరూపుడును
అంతటనుండెడి నిరాకారుడును
మనసుకు లొంగని నిర్వికారుడును
ధ్రువముగ నుండే నిశ్చల రూపుని

4. ఇంద్రియ వశమున సమభావనతో
అన్నిభూతముల హితమును కోరుచు
పూజలు చేయుచు ధ్యానమొనర్చెడి
నట్టియోగులే నన్ను చేరుదురు

5. కనబడకుండే దైవరూపమును
చేరగ చేసే సాధన కష్టము
దేహ భావనను వదలని వారికి
కానని దైవము చేరుట కష్టము

6. నన్నేనమ్మియు నాపై భక్తిని
కర్మల ఫలితము నాకే ఇచ్చియు
భక్తిభావమున దైవరూపమును
ఎప్పుడు వదలక పూజలు చేసెడి

7. నాపై మాత్రమె మనసును ఉంచెడి
పరమభక్తులకు మిక్కిలి త్వరగా
మరణరూపమగు భవసాగరమును
దాటునట్లుగను చేయుదు పార్థా!

8. నాపై వదలక మనసును నిలుపుము
నాపై వదలక బుద్ధిని ఉంచుము
నన్నేవదలక తిరముగ నుండిన
సంశయమన్నది కలుగనె కలుగదు

9. మనసును నాపై తిరమగ ఉంచుట
చేత కానిచో వినుమో పార్థా!
అభ్యాసమ్మున యత్నము చేయుము
నన్నే పొందుట కిదియే మార్గము

10. అభ్యాసమ్మున నన్ను చేరుటకు
వీలుకానిచో వినుమో పార్థా!
నాకే చెందెడి పనులను చేయుము
అట్టి పనులచే నన్ను చేరెదవు

11. నన్ను చేరుటకు పనులను చేయుట
వీలుకానిచో వినుమో పార్థా!
మనసును వశమున నుంచుచు మెలగుచు
పనుల ఫలితమును వీడుము నీవే

12. తత్త్వముకంటెను జ్ఞానముగొప్పది
జ్ఞానముకంటెను ధ్యానము గొప్పది
ధ్యానముకంటెను త్యాగముగొప్పది
త్యాగమువలననె శాంతి లభించును

13. ఎవ్వరియందును ద్వేషములేకను
అందరికిచ్చుచు ప్రేమయు దయయును
నాకను నాదను భావము వీడుచు
సుఖదుఃఖమ్ముల సమతను ఓర్పును

14. ఎప్పుడు తృప్తిని పొందెడి యోగియె
మనసుకు లొంగక దృఢనిశ్చయమున
మనసును బుద్ధిని నాపై నుంచిన
వాడేభక్తుడు నాకును ఇష్టుడు

15. ఎవరికి బాధలు కలిగింపకనూ
ఎవరిచె బాధలు పడకుండగనూ
హర్షదోషభయ శంకలు వీడిన
వాడే భక్తుడు నాకును ఇష్టుడు

16. కోరిక లేకయు దేహమనమ్ముల
శుభ్రత నొందిన దక్షుడు సముడును
దుఃఖము వీడుచు కర్తగ తలపని
వాడే భక్తుడు నాకును ఇష్టుడు

17. పొందిన వానికి పొంగిపోవకను
ద్వేషములేకయు శోకముచెందక
ఆశలు వీడియు కర్మలు వదలిన
వాడే భక్తుడు నాకును ఇష్టుడు

18. శత్రుల మిత్రుల గౌరవ బాధల
వేడిని చలిలో సుఖదుఃఖమ్ముల
కోరిక లేకయు సమతను కలిగిన
వాడే భక్తుడు నాకును ఇష్టుడు

19. పొగడిన తెగడిన ఒకటని యెంచుచు
దేవుని తలచుచు తృప్తిని పొందుచు
స్వార్థములేకను అచల బుద్ధిగల
వాడే భక్తుడు నాకును ఇష్టుడు

20. పైన పేర్కొనిన గుణములు కల్గియు
ధర్మామృతమును పానము చేయుచు
శ్రద్ధను కలిగియు నన్నే నమ్మిన
వాడే భక్తుడు నాకును ఇష్టుడు

**ఇది భక్తియోగము**

## 13. క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగ యోగము

1. అర్జునడనియెను కృష్ణునితోడను
ప్రకృతియు పురుషుడు భూ క్షేత్రజ్ఞులు
జ్ఞానము జ్ఞేయము వీటినన్నిటిని
తెలియగ చెప్పిన వినగ కోరెదను

2. కృష్ణుండనియెను వినుమో పార్థా!
ఈ దేహంబే క్షేత్రమనంబడు
క్షేత్రము తెలిసిన క్షేత్రజ్ఞుండని
తత్త్వము తెలిసిన పండితులందురు

3. క్షేత్రములందలి జీవుడ నేనే
ప్రకృతిని పురుషుని తెలిపెడి జ్ఞానము
నిజమగు జ్ఞానము నేనెదుంగుదును
అట్టి జ్ఞానమును తెలిపెద పార్థా!

4. క్షేత్రంబేదియొ అది యెట్లుండునొ
దాని భావములు ఏర్పడువిధమును
క్షేత్రజ్ఞుండన అతని పోడిమిని
వివరము లేర్పడ తెలిపెద వినుము

5. భూ క్షేత్రజ్ఞుల తత్త్వము నెరిగిన
ఋషులును పాడిరి పరిపరి విధముల
బ్రహ్మ సూత్రములు హేతువు తోడను
ఖచ్చితమ్ముగను దీనిని తెలిపెను

6. పంచభూతములు అహంకారమును
బుద్ధియు ప్రకృతియు పదియు నంగములు
అట్లే మిగిలిన మనసును ఎంచగ
అంగము లెరిగెడి విషయవాసనలు

7. కోరిక ద్వేషము సుఖదుఃఖమ్ములు
స్థూల శరీరము తెలివియు ధైర్యము
వీటిని కూడిన మార్పులు చేర్పులు
క్షేత్ర రూపముగ తెలియగ చెప్పిరి

8. గొప్పలు చెప్పక దంభము వదలియు
అహింస క్షమయును మంచి నడతయును
గురుజన సేవయు శుభ్రత కలిగియు
ఆత్మనిగ్రహము స్థైర్యము కలిగియు

9. భోగములందున కోరికలుంచక
అహంకారమును పొందక ఉండుచు
చావుపుట్టుకలు జరారోగములు
దుఃఖదోషముల పరిపరి తలపక

10. భార్యాపుత్రుల గేహసంపదల
కోరిక లేకయు బంధము వదలుచు
ఇష్టమయిష్టము జరిగినయప్పుడు
సమభావమ్మున మెలగుచు ఉండుట

11. ఇతరము తలపక నెప్పుడునాపై
కదలని భక్తిని కలిగియుండుటయు
ఏకాంతమ్మున వాసము చేయుచు
విషయాసక్తిని పొందకుండుటయు

12. అధ్యాత్మమ్మున నిలుకడనుండుచు
తత్త్వజ్ఞానము కలిగియుండుటయు
జ్ఞానమనంబడు పైన పేర్కొనిన
వానిని వదలిన అజ్ఞానంబగు

13. తెలియగ తగినది తెలియ వలసినది
తెలుసు కున్నచో మోక్షముపొందును
మొదలే లేనిది పరబ్రహ్మమని
ఉందని లేదని చెప్పుట జరుగదు

14. ఆతని చేతులు పదములు కన్నులు
చెవులును తలయును ముఖము లన్నియును
అన్నిలోకముల తిరముగ ఉన్నవి
విశ్వమంతటను బ్రహ్మయె ఉండును

15. ఇంద్రియ గుణముల నన్నియు ఎరుగును
సర్వేంద్రియముల దూరము చేయుచు
లోకము లన్నియు తానె భరించును
గుణములు లేకయు గుణములు పొందును

16. భూతములందును బయటను ఉండును
కదలియు కదలని జగమున ఉండును
సూక్ష్మరూపునిగ తెలియక ఉండును
దగ్గర దూరము అంతట ఉండును

17.విభజన చెందక ఒకే రూపమును
విభజన చెందియు వివిధరూపముల
బ్రహ్మ విష్ణులుగ రుద్రరూపమున
సృష్టిస్థితులును లయమును చేయును

18.జ్యోతుల జ్యోతియు మాయల మాయయు
జ్ఞాన రూపుడును జ్ఞేయ రూపుడును
జ్ఞాన గమ్యుడును సర్వమునతడే
సర్వహృదయముల ఉండును అతడే

19.క్షేత్రము తెలిపితి జ్ఞానము తెలిపితి
జ్ఞేయము గూర్చియు వివరము తెలిపితి
వీనిని తెలిసిన నా భక్తుండగు
వీనిని కోరిన నన్నే చేరును

20.ప్రకృతియు పురుషుడు సనాతనమ్ములు
రాగము ద్వేషము వానిలో మార్పులు
త్రిగుణాత్మకములు ప్రకృతి జన్యములు
మూడు గుణములై ప్రకృతిని పుట్టెను

21. కార్యకరణములు కలిగించుటలో
కారణ మన్నది ప్రకృతియె కాదా!
సుఖదుఃఖమ్ములు పొందుటయందును
కారణ మనునది పురుషుడె కాడా!

22. ప్రకృతిని పుట్టిన గుణముల పొందుచు
ప్రకృతిన ఉండియు అనుభవించునులె
గుణముల కలయిక జీవుడు పొందియు
ఉత్తమ నీచపు జన్మల పొందును

23. దేహమునందలి పురుషుడు నిజముగ
పరమాత్మునిగను ఉపద్రష్టగను
అనుమంతుండుగ భర్తగ భోక్తగ
మాహేశ్వరునిగ పేర్లను పొందును

24. పురుషుని తత్త్వము గుణ సహితమ్ముగ
ప్రకృతి తత్త్వమును తెలిసిన వారలు
అన్ని విధమ్ముల తగులము లున్నను
పునర్జన్మలను పొందనె పొందరు

25.దేవుని చూతురు శుద్ధ మనమ్మున
కొందరు చూతురు ధ్యాన యోగమున
కొందరు చూతురు సాంఖ్య యోగమున
కొందరు చూతురు కర్మ యోగమున

26.ఈ మార్గమ్ములు తెలియనివారలు
జ్ఞానులు చెప్పగ వినిన మార్గమును
అనుసరించుచును వారలందరును
భవసాగరమును దాటుట నిక్కము

27.కదలెడి కదలని ప్రాణులన్నియును
భూక్షేత్రజ్ఞుల కలయిక చేతను
పుట్టుచునుండును తెలియుము నీవును
భరత వంశమున పుట్టిన ఫల్గుణ!

28.అన్ని భూతముల సమభావమ్మున
ఉండెడి దేవుని నాశరహితుడని
ప్రాణులు కూడా నశించిపోవని
తెలిసిన వాడే నిజమగు విజ్ఞుడు

29.అన్నిజీవులను సమభావమ్మున
పరమేశ్వరునిగ భావన చేయుచు
ఆత్మ గతమ్మున హింసను పొందని
వాడే చేరును పరమపదమ్మును

30.అన్నికార్యములు అన్నివిధమ్ముల
ప్రకృతి మూలమున జరుగుచు నున్నవి
తానే కర్తను కాదని తెలిసిన
వాడే నిజమగు ద్రష్టగ నెరుగుము

31.అనేక విధముల కనబడు జీవులు
దేవునియందే తిరముగ ఉండును
దేవుని నుండే వెలువడుచుండును
దీనిని తెలిసిన బ్రహ్మను చేరును

32.నాశ రహితుడగు పరమాత్ముండును
ప్రాణుల దేహము చేరినప్పటికి
అనాది నిర్గుణ రూపుడు కావున
కర్మలు తాకవు కర్తగ మారడు

33. అంతట నుండెడి ఆకాశమ్మే
సూక్ష్మ మగుటచే గుణములు తాకవు
అన్ని దేహములు ఆత్మలు కలిగిన
నిర్గుణ మగుటను గుణములు తాకవు

34. ఒక్క సూర్యుడే సమస్త జగముల
కాంతుల నింపెడి విధముగ పార్థా!
ఒక్క ఆత్మయే సర్వజీవముల
లోపల నుండుచు ప్రకాశ మొందును

35. భూ క్షేత్రజ్ఞుల మధ్య భేదమును
ప్రకృతినుండియూ విడివడు మార్గము
జ్ఞాన నేత్రముల చూచెడి వారలు
పరమపదమ్మును చేరుచు నుందురు

**ఇది క్షేత్ర క్షేత్రజ్ఞ విబాగ యోగము**

## 14. గుణత్రయ విభాగ యోగము

1. కృష్ణుండనియెను పార్థుని తోడను
ఉత్తమ జ్ఞానము మరల తెలిపెదను
దీనిని తెలిసిన మునులు సర్వులును
పరమగు సిద్ధిని పొందిరి ఇలలో

2. ఇట్టి జ్ఞానమును పొందిన వారలు
నా రూపమ్మును చేరుట సహజము
సృష్టి కాలమున పుట్టరు వారలు
ప్రళయమునందున కలతను చెందరు

3. ప్రాణులన్నిటికి జన్మస్థానము
బ్రహ్మరూపమగు ప్రకృతిని నేనే
దాని గర్భమున బీజమునుంతును
సర్వభూతముల పుట్టుక అదియే

4. నానాయోనుల పుట్టెడి వారల
తల్లి రూపమున ప్రకృతియె ఉండును
బీజమునిచ్చెడి తండ్రిని నేనే
సర్వప్రాణులకు తండ్రిని నేనే

5. సత్త్వరజస్తమ గుణములు మూడును
ప్రకృతినుండియే పుట్టుచునుండును
నాశముచెందని ఆత్మను ఇవియే
కాయమునందున బంధమొనర్చును

6. ఈ మూడింటిని సత్త్వగుణమ్మే
నిర్మల మైనది వెలుగుచునుండును
వికార మొందదు సుఖమును కోరియు
జ్ఞానము కోరియు బందీ చేయును

7. రాగాత్మకమగు రజోగుణమ్మే
కోరికనుండే పుట్టుచునుండును
కర్మలయందున వాని ఫలమ్ముల
అదియే జీవుని బందీ చేయును

8. అజ్ఞానమ్మున పుట్టును తమమే
మోహము పొందును జీవులు దీనిని
ప్రమాదమ్ములను జాగున నిద్రను
బందీ చేయును జీవుని పార్థా!

9. సత్త్వగుణమ్మే సుఖముల ముంచును
రజోగుణమ్మే కర్మల ముంచును
తమోగుణమ్మే తెలివిని కప్పియు
ప్రమాద మొందగ చేయును పార్థా!

10. రజస్తమమ్ముల నణచును సత్త్వము
తమోసత్త్వముల నణచును రజమును
సత్త్వరజమ్ముల నణచును తమమును
అణచుట వృద్ధిని పొందుగ పార్థా!

11. శరీరమందున మనస్సునందున
బుద్ధియు జ్ఞానము కలుగు చున్నచో
సత్త్వగుణమ్మది జీవుల యందున
పెరుగుచున్నదని తెలియుము పార్థా!

12. లోభము నొందిన కర్మలు చేసిన
కలతను చెందిన కోరిక లొందిన
రజోగుణమ్మది జీవుల యందున
పెరుగుచున్నదని తెలియము పార్థా!

13.బుద్ధితగ్గుటయు సోమరితనమును
ప్రమాదమొందిన మోహము చెందిన
తమోగుణమ్మది జీవుల యందున
పెరుగుచున్నదని తెలియము పార్థా!

14.సత్త్వగుణమ్మది పెరిగినయప్పుడు
దేహధారులకు మరణము గల్గిన
ఉత్తమ కర్మలు చేసెడి వారలు
చేరెడి స్వర్గము కలుగును ఫల్గుణ!

15.రజోగుణముతో మృత్యువునొందిన
కర్మలు కోరెడి వారికి పుట్టును
తమో గుణముతో మృత్యువునొందిన
నీచయోనులను పుట్టుచునుండును

16.మంచి కర్మలను చేసెడి సత్త్వుల
సుఖములు జ్ఞానము కలుగుచునుండును
రజోగుణులకును ఫలితము దుఃఖము
తామస గుణులకు ఫల మజ్ఞానము

17.సత్త్వగుణమ్మున జ్ఞానము కలుగును
రజోగుణమ్మున లోభము కలుగును
తమో గుణమ్మున ప్రమాదమొందును
అజ్ఞానమ్మును మోహము కలుగును

18.సత్త్వగుణమ్మున చేరును స్వర్గము
రజోగుణమ్మున చేరును భూమిని
తమో గుణమ్మున పాపకార్యములు
చేయుచునుండిన చేరును నరకము

19.గుణాతీతమును కర్తగ ఎంచుచు
చూచిన వాడే ద్రష్టగ మారును
గుణాతీతునిగ దేవుని తలచిన
వాడే చేరును పరమ పదమ్మును

20.దేహుడు దేహము పొంద మూలమగు
మూడుగుణమ్ముల దాటినవాడే
పుట్టుక చావును జరయును దుఃఖము
వీడుచు నాతడు మోక్షమునొందును

21.త్రిగుణాతీతుని లక్షణమెట్టిది?
ఆతడు మెలగెడి మార్గము లెట్టివి?
మూడు గుణమ్ముల దాటుట ఎట్లో
తెలుపుము కృష్ణా! ఫల్గుణుడడిగెను

22.వెలుగును మోహము వర్తన తామే
సత్త్వరజస్తమ గుణముల నేర్పడ
ద్వేషమునొందడు త్రిగుణాతీతుడు
కోరడు దేనిని పలికెను కృష్ణుడు

23.మూడు గుణమ్ముల మనుసు గణింపక
చేసెడి పనులను చలనము పొందక
గుణముల యందే గుణము లుండునని
దేవుని తలచుచు తాను చలింపడు

24.సుఖదుఃఖమ్ముల సమముగ తలచుచు
కాంచన మృత్తుల సమముగ నెంచుచు
ప్రియాప్రియములను సమముగ చూచుచు
పొగడిన తెగడిన సమముగ నుండును

25.మానము బన్నము సమముగ తలచుచు
శత్రుని మిత్రుని సమముగ చూచుచు
కర్మలఫలితము త్యాగము చేయుచు
మెలగెడివాడే త్రిగుణాతీతుడు

26.మారని వీడని భక్తి యోగమున
నాకే ఎప్పుడు సేవలు చేయుచు
గుణములన్నిటిని పూర్తిగ వదలిన
బ్రహ్మను చేరగ అర్హత పొందును

27.నాశరహితుడగు పరబ్రహ్మకును
అమృతరూపునకు శాశ్వత వాసికి
ధర్మరూపునకు సదానందునకు
నేనే స్థానము నేనే మూలము

ఇది గుణత్రయ విబాగ యోగము

## 15. పురుషోత్తమ యోగము

1. కృష్ణుండనియెను దైవము మూలము
బ్రహ్మమె కాండము వేదమాకులుగ
రావి చెట్టనెడి భవమును తెలిసిన
వేద రహస్యము తెలిసిన జ్ఞానుడు

2. చెట్టుకొమ్మలను గుణములు పెరుగును
విషయవాసనలు చిగురుగ మారును
కర్మ బంధములు వేళ్లని తెలియుము
పైకిని క్రిందకు వ్యాప్తిని చెందును

3. వృక్షరూపమును తెలియుట కష్టము
ఆద్యంతములను చూడగలేమిక
అహమను మమతను గట్టి వేళ్లుగల
చెట్టును త్రుంచుము వైరాగ్యమ్మున

4. దైవము చేరిన వారలు మరలరు
ఆతనినుండే ప్రవృత్తి పెరుగును
ఆది దైవమును శరణము కోరుచు
పరమపదమ్మును వెదుకగ వలయును

5. అహమును మోహము కోరిక వదలిన
ఆత్మజ్ఞానమున కామము తొలగిన
సుఖదుఃఖమ్ముల ముక్తిని పొందిన
పరమపదమ్మును చేరుచు నుందురు

6. సూరీడైనను చందురు డగ్గియు
వెలిగే దేవునకివ్వరు వెలుగును
పరమ పదమ్మును చేరిన పుణ్యులు
మరలరు వెనుకకు రారీలోకము

7. అనాది గుండెడి జీవములన్నియు
ప్రాణిలోకమున నా భాగములే
మనసును కూడిన షష్ఠాంగమ్ములు
ఆకర్షించును తనతో కలియగ

8. గాలిని వాసన కూడినట్లుగను
ఆత్మశరీరము వదలిన వెంటనే
కొత్తశరీరము చేరేటప్పుడు
ఇంద్రియమ్ములును దానిని చేరును

9. చెవులును కళ్ళును చర్మము నాలుక
ముక్కును మనసును జీవిని చేరియు
విషయ వాసనల అనుభవమ్ములను
జీవుడు పొందును ఎప్పటి వలెనే

10. జీవుడు దేహము వదలునప్పుడును
వసించునప్పుడు అనుభవమప్పుడు
గుణములు కూడిన మూఢులు తెలియరు
జ్ఞాన నేత్రమున జ్ఞానులెరుగుదురు

11. హృదయమునందలి ఆత్మతత్త్వమును
యత్నము తోడను యోగులెరుగుదురు
మనసున శుద్ధిని పొందని మూఢులు
యత్నము చేసియు తత్త్వమునెరుగరు

12. జగముల నిండుగ వెలుగులు నింపే
సూర్యుని వెలుగే నాదని తెలియుము
చంద్రుని కాంతియు నగ్ని తేజమును
నాదని తెలియుము నాదని తెలియుము

13.సర్వశక్తులను భూమిని చేరియు
జీవులభారము వహించుచుందును
రసమును కూడిన చంద్రరూపమున
మొక్కల కన్నిట బలమును కూర్తును

14.ప్రాణులదేహము చేరిన పిదపను
వైశ్వానరుడను రూపము నొందియు
ప్రాణాపానపు వాయువు తోడను
నాలుగన్నముల జీర్ణము చేయుదు

15.జీవుల హృదయము నందును నేనే
జ్ఞానాపోహన స్మృతులును నేనే
వేదాంతునిగను వేదజ్ఞునిగను
వేదమూలమున తెలియుదు నేనే

16.క్షరుడక్షరుడను రెండువిధమ్ముల
మనుజులు కలరీ లోకము నందున
నాశము చెందెడి దేహము క్షరుడన
నాశము చెందని జీవడ క్షరుడు

17. వీరలకంటెను ఉత్తమ పురుషుడు
వేరొక డుండును పరమాత్మునిగను
నాశము నొందదు ముల్లోకమ్ముల
జీవుల చేరియు పోషణ చేయును

18. నాశము చెందెడి వారికతీతుడ
నాశము చెందని వారికుత్తముడ
లోకము లందున వేదములందున
పురుషోత్తముడని ప్రసిద్ధి చెందితి

19. తత్త్వజ్ఞానము తెలిసిన జ్ఞానియు
పురుషోత్తముడని పేర్కొను నన్నే
అన్నియు తెలిసిన ఆతడెప్పుడును
అన్ని విధమ్ముల నన్ను భజించును

20. తెలియగ లేనిది వినుమీ శాస్త్రము
తెలియజెప్పుదును నీకు ధనంజయ
దీనిని తెలిసిన జ్ఞాని యెప్పుడును
కృత కృత్యుడగు జీవితమందున

ఇది పురుషోత్తమ యోగము

# 16. దైవాసుర సంపద్విభాగ యోగము

1. దైవము పలికెను సంపదలనగా
అభయము శుద్ధియు జ్ఞానము దానము
దమమును యజ్ఞము పఠన పాఠనము
తప మార్జవములు కలిగి యుండుటయు

2. సత్యాహింసలు కోపము వదలుట
త్యాగము శాంతియు దయయు నిరాశయు
మృదు భావమ్మును సిగ్గు పడుటయును
కూడని పనులను చేయ కుండుటయు

3. తేజమునోర్పును ధైర్యము శుభ్రత
ద్రోహము చేయక గొప్పలు వీడుట
దైవీసంపద తోడను బుట్టిన
వాని గుణమ్ములు తెలియుము పార్థా!

4. దంభము దర్పము గర్వము కోపము
పరుష వచనములు కూడని పనులును
అసుర సంపదల తోడనుబుట్టిన
వాని గుణమ్ములు తెలియుము పార్థా!

5. మోక్షమునిచ్చును దైవీసంపద
బంధకారణము అసురీ సంపద
దైవీసంపద తోడబుట్టితివి
నిజముగ వదలుము శోకము పార్థా!

6. మానవులందరు రెండు విధమ్ములు
దైవగుణమ్ముల ఉందురు కొందరు
అసుర గుణమ్ముల ఉందురు కొందరు
అసుర లక్షణము తెలిపెద పార్థా!

7. ధర్మాధర్మపు కార్యములందున
వలసిన కార్యము నసురులు చేయరు
శుభ్రత నొందరు మంచిని చేయరు
నిజమును పలుకరు వారలెన్నడును

8. జగదాధారము లేదని అందురు
భగవంతుండును లేదని అందురు
స్త్రీలును పురుషులు కలియుట చేతను
కామమె సృష్టికి కారణమందురు

9. నాస్తిక దృష్టిని ఆత్మను తలపక
అల్పబుద్ధితో అహితము చేయుచు
క్రూర కార్యముల ఆచరించుచును
లోకనాశనము చేయుచునుందురు

10. దంభము గర్వము మదమును కూడియు
తృప్తిని చెందని కామము వీడక
మోహముచేతను మిథ్యను వలచియు
చెడుదారులలో తిరుగుచు నుందురు

11. మరణము చెంతకు చేరేవరకును
మెండగు చింతను పొందుచునుందురు
విషయ భోగముల మునుగుచు తేలుచు
ఇదియే నిజమగు సుఖమని యెంతురు

12. ఆశాపాశపు బంధము తోడను
కామము కోపము నాశ్రయించుచును
కామభోగములు తీరుట కొరకును
అన్యాయమ్మున ధనము పొందుదురు

13.కోరిన కోర్కెలు పొందగల్గితిని
ఇంకను కోర్కెలు పొందగల్గుదును
ఇప్పటి కెంతో ధనము పొందితిని
ఇంకను ఎంతో ధనముల పొందుదు

14.ఈ నాశత్రుని చంపివేసితిని
ఇతర శత్రువుల చంపగల్గుదును
అన్నియు నావే భోగిని నేనే
సిద్ధుడ నేనే బలమును నాదే

15.ధనికుడనేనే అధిపతినేనే
నాతో సముడగు వాడే యుండడు
పనులను చేసెద దానమునిచ్చెద
వినోద మొందెద ననజ్ఞానము

16.అనేక విధముల భ్రమలకులోనై
మోహబంధముల చిక్కిన వారై
కామభోగముల కోరిక వీడక
ఘోర నరకమును పొందుదు రసురులు

17.తామేగొప్పని భావనచేయుచు
ధనగర్వమ్ముల మదమును కూడియు
విధిని వీడుచును నామమాత్రముగ
ధంభము తోడను యజ్ఞమొనర్తురు

18.అహంకారమును బలమును గర్వము
కామము క్రోధము కూడియుండియును
అందరిలోపల నుండెడి నన్నే
ద్వేషము తోడను నిందలుసేతురు

19.పరులను తిట్టుచు ఉండెడి క్రూరుల
భవమున మునిగిన నీచమానవుల
ఎల్లవేళలను మాటి మాటికిని
అసుర యోనులను చేరవేయుదును

20.అసురయోనులను చేరిన మూఢులు
జన్మజన్మలను నన్నే తెలియక
దానికంటెనూ అతిహీనమ్మగు
గతులపొందుదరు తెలియుము పార్థా!

21.కామము క్రోధము లోభము మూడును
నరక ద్వారములు ఆత్మనాశములు
కామము క్రోధము లోభము మూటిని
అందువలననే వదలుట యుక్తము

22.నరకము చూపెడి మూడు మార్గముల
వదలెడి వారలు వినుమో పార్థా!
శుభకార్యములే చేయుచునుందురు
పరమపదమ్మును నన్ను చేరుదురు.

23.చట్టములందున చెప్పిన విధమును
విడిచి యధేచ్ఛను తిరిగెడి వారలు
సిద్ధిని పొందరు సుఖమును పొందరు
పరమపదమ్మును అసలే పొందరు

24.చేసెడి చేయని పనులనిర్ణయము
శాస్త్రములందున చెప్పిన విధమును
బాగుగ తెలిసియు చేయుట యుక్తము
మంచివారికది సరియగు మార్గము

**ఇది దైవాసుర సంపద్విబాగ యోగము**

# 17. శ్రద్ధాత్రయ విభాగ యోగము

1. ఓ శ్రీకృష్ణా! పార్థుడు పలికెను
శాస్త్రము వదలియు శ్రద్ధ వహించియు
పూజలు చేసిన వారల నిష్ఠను
సత్త్వరజస్తమ మార్గము లెయ్యవి

2. కృష్ణుడు చెప్పెను శాస్త్రము చెప్పని
సహజశ్రద్ధను చేసెడి పూజలు
సత్త్వరజస్తమ మూడు విధమ్ముల
ఉండెడి వివరణ వినుమో పార్థా!

3. మనసును బట్టియు శ్రద్ధయు నుండును
మనిషికెప్పుడును శ్రద్ధయె రూపము
శ్రద్ధను తెలిపెడి అట్టి రూపమును
మానవులందరు పొందుచు నుందురు

4. సాత్త్విక పురుషులు దేవ పూజలను
రాజస పురుషులు యక్షరాక్షసుల
తామస పురుషులు ప్రేత భూతముల
పూజలు సేతురు లోకములందున

5. అహమును గర్వము కలిగిన వారలు
కామరాగములు కూడిన వారును
శాస్త్రములొల్లని ఘోరతపమ్మును
చేసెడి వారలు లోకుల నుందురు

6. శరీరమందలి పంచభూతముల
జీవులనుండెడి ఆత్మను నన్నును
కృశింపజేసెడి జ్ఞాన హీనులును
అసురభావమును పొందిన వారలు

7. మానవులందరి ఆహారమ్ములు
మూడువిధమ్ముల ప్రీతిగనుండును
యజ్ఞము తపమును దానములన్నియు
మూడు విధమ్ములు వివరము తెలుపుదు

8. ఆయువు బుద్ధిని బలమారోగ్యము
సుఖమును ప్రీతియు పెంచుచనుండెడి
రసమును స్నిగ్ధము స్థిరమును హృద్యము
ఆహారములవి సాత్త్విక ప్రియములు

9. చేదును పులుపును ఉప్పును వేడియు
కారము మాడును దాహమువేసెడి
శోకము రోగము కలిగించునవియు
ఆహారములవి రాజస ప్రియములు

10. సగమునుడికినవి రసములులేనివి
వాసనతోడను పాచిపోయినవి
ఎంగిలితోడను శుద్ధముకానివి
ఆహారములవి తామస ప్రియములు

11. శాస్త్రము చెప్పిన విధితో గూడిన
మనమున గట్టిగ నిశ్చయించుకొని
ఫలితము కోరక చేసెడివన్నియు
సాత్త్విక యజ్ఞమనంబడు చుండును

12. ఆడంబరమున నాచరించుచును
ఫలితములన్నియు మనమున తలచుచు
చేసెడి వన్నియు వినుమో ఫల్గుణ!
రాజస యజ్ఞమనంబడు చుండును

13.శాస్త్రము చెప్పక మంత్రము లేకయు
అన్నదానములు చేయక జరిగెడి
దక్షిణలేనిది శ్రద్ధవిహీనము
తామస యజ్ఞ మనంబడు చుండును

14.దేవుని ద్విజులను గురువుల జ్ఞానుల
పూజలు చేయుచు పూతము సరళము
బ్రహ్మచర్యమున హింస చేయకను
చేసెడి తపమే శారీరకమగు

15.కలతను చెందక సత్యముతోడను
ప్రియమగు హితమగు మాటలు పలుకుచు
వేదశాస్త్రములు తప్పక చదువుచు
చేసెడు తపమే వాచిక తపమగు

16.ప్రసన్న మనమును శాంత రూపమును
భగవచ్చింతన ఆత్మనిగ్రహము
పవిత్రభావము వీడక ఎపుడును
చేసెడు తపమే మానసతపమగు

17.శరీరవాచిక మానస తపముల
ఫలమును కోరక మిక్కిలి శ్రద్ధను
నిజమగు యోగులు చేసెడుదానిని
సాత్త్విక తపమని పేర్కొనుచుందురు

18.గౌరవ మొందగ చేసెడి పూజలు
అనిశ్చయమ్ముగ దంభముతోడను
క్షణిక ఫలమ్ముల నిచ్చెడు దానిని
రాజసతపమని పేర్కొనుచుందురు

19.మొండి పట్టుదల వీడక మనసున
తనకే బాధలు కూర్చెడు నట్టివి
పరుల నాశమును కోరుచు చేసిన
తామసతపమని పేర్కొనుచుందురు

20.తన ధర్మంబని దానము చేయుచు
దేశ కాలముల పాత్రత నెరుగుచు
ప్రత్యుపకారము కోరక యుండిన
సాత్త్విక దానం బగును నిజమ్ముగ

21.ప్రత్యుపకారపు ఆశను వదలక
ప్రతిఫలమ్మునే కోరుచు నిచ్చిన
మనసుకు బాధలు కలుగుచుండినను
రాజస దానంబగును నిజమ్ముగ

22.దేశకాలములు పాటింపకయును
పాత్రత నెరుగక దానముచేసిన
మంచిని కూర్చని తెలియక చేసిన
తామస దానంబగును నిజమ్ముగ

23.ఓంతత్సత్తను మూడు పేర్లతో
పరబ్రహ్మమును స్మరించు చుందురు
దాని నుండియే బ్రహ్మజ్ఞుండును
వేదము యజ్ఞము ఏర్పడుచుండును

24.వేదమంత్రములు చదివెడివారును
యజ్ఞము దానము తపమును చేయగ
ఓంకారమ్మును ఉచ్చారించుచు
ప్రారంభింతురు సర్వసమయముల

25.మోక్షము కోరుచు లాభముకోరక
యజ్ఞము దానము తపమును చేయుచు
తత్తను నామము ఉచ్చారించుచు
ఉందురు తిరముగ ఎల్లవేళలను

26.సత్య భావమున సాధు భావమున
ఉత్తమ కర్మలు చేయునప్పుడును
సత్తను నామము ఉచ్చారించుచు
శుభమును కోరుదురెల్ల వేళలను

27.యజ్ఞదానముల తపములయందలి
స్థితిని తెల్పుటను సత్తని అందురు
భగవత్ర్పీతికి చేసెడి పనులను
నిలుకడ తోడను సత్తని అందురు

28.నమ్మిక లేకయు చేసెడి హోమము
ఇచ్చెడి దానము ఒనర్చుతపమును
ఇహపరమ్ములకు మేలును చేయని
కర్మ లసత్తని చెప్పుచునుందురు

ఇది శ్రద్ధాత్రయ విబాగ యోగము

# 18. మోక్ష సన్న్యాస యోగము



1. మహాబాహుడా! హృషీ కేశుడా!
అర్జును డనియెను శ్రీకృష్ణునితో
సన్న్యాసమ్మును త్యాగ తత్త్వమును
తెలియగ గోరెద తెలుపుము దేవా!

2. కోరియు చేసెడి పనులను విడుచుట
సన్న్యాసంబని పండితులందురు
అన్ని కర్మలను విడువ త్యాగమని
కొందరి మతమని తెలిపెను కృష్ణుడు

3. కర్మలన్నియును దోషపూరితము
వానిని వదలుట కొందరి మతమగు
యజ్ఞదానములు తపమును విడుచుట
వలదని చెప్పుట కొందరి మతమగు

4. భరతకులోత్తమ! ఫల్గుణ! వినుమా
కర్మత్యాగముల నిశ్చయమ్మునను
త్యాగముగూర్చిన భావన తెలుపుదు
మూడు విధమ్ముల త్యాగములుండును

5. యజ్ఞదానములు తపమును విడువక
తప్పక వాటిని చేయగ వలయును
యజ్ఞదానములు తపములు మూడును
బుద్ధిమంతులను పూతమొనర్చును

6. యజ్ఞదానములు తపములు చేయుచు
విధియగు కర్మలు వదలక చేయుచు
వాటి ఫలితములు వదలుట మేలని
మంచి దదేయని తెలుపుదు పార్థా!

7. శాస్త్రము చెప్పిన కర్మలు చేయక
వదలుట మంచిది కానేకాదు
మోహవశమ్మున దానిని వదలుట
తామస త్యాగముగా పేర్కొందురు

8. కర్మలన్నిటను దుఃఖము కలదని
దేహబాధకును భయపడి వదలిన
ఫలితములివ్వని యట్టిత్యాగమును
రాజస త్యాగముగా పేర్కొందురు

9. శాస్త్రము చెప్పిన పనులను చేయుచు
అదియే విధియని మనమున ఎంచుచు
ఫలముల కోరక ఉండిన ఫల్గుణ!
సాత్త్విక త్యాగముగా పేర్కొందురు

10. మంచిని చేయని కర్మల, దూరక
మంచి నొసంగెడి కర్మల మెచ్చుచు
సత్త్వ గుణుండును బుద్ధిమంతుడును
సంశయ రహితుని త్యాగిగ నెరుగుము

11. పనులను చేయక పూర్తిగ వదలుట
దేహధారులకు సాధ్యము కాదది
కర్మ ఫలమ్ముల వదలిన వాడే
నిజమగు త్యాగిగ పేర్కొనుచుందురు

12. ఇష్టమయిష్టము మిశ్రము మూడగు
విధముల నుండును కర్మఫలమ్ములు
త్యాగము చేయక ఫలములనొందును
త్యాగము చేసిన ఫలముల నొందదు

13. సాంఖ్యశాస్త్రమున చెప్పిన విధమున
కర్మాంతమ్మును చేయునుపాయము
కర్మఫలములకు సిద్ధిని కూర్చెడి
ఐదు హేతువుల తెలుపుదు పార్థా!

14. అధిష్ఠానమును కర్తయు కరణము
వివిధ చేష్టలును దైవము నైదును
కర్మలు చేయగ కారణమ్ములవి
వివరముగానే తెలుపుదు పార్థా!

15. మాటను మనమున దేహము తోడను
శాస్త్రము తెలిపిన తెలుపని వైనను
మానవు డన్నిట కర్మలు మొదలిడ
మూలహేతువులు ఐదని తెలియుము

16. మూలకారణము లివియిట్లున్నను
ఆత్మను కర్తగ తలచెడి మూర్ఖుడు
విపరీతమ్మగు బుద్ధుల తోడను
ఆత్మరూపమును నిజముగ నెరుగడు

17.మనసున కర్తను కానని తలచెడి
వానికి విషయము కర్మలు అంటవు
అన్ని లోకముల చంపివేసినను
ఎట్టి పాపములు వానిని చేరవు

18.కర్మకు ప్రేరణ జ్ఞాతము జ్ఞానము
జ్ఞేయము మూడను విధములు తెలియము
కర్మ సంగ్రహము కర్తయు కరణము
క్రియా రూపమున మూడు విధమ్ములు

19.త్రిగుణమ్ములనూ తెలిపెడి సాంఖ్యము
జ్ఞానము కర్మము కర్తయు మూడగు
విధముల నేర్పడు రీతిని తెలిపెద
వినుమో పార్థుడ! వివరముగానూ

20.వివిధ రూపముల కనబడు ప్రాణుల
ఆత్మను నేనే ఒకటిగ ఉందును
సమభావమ్మున ఒకటిగనెంచిన
అట్టి జ్ఞానమే సాత్త్విక మనబడు

21.వివిధ రూపముల కనబడు ప్రాణుల
వివిధ రూపముల భావన చేయుచు
వేరు వేరుగను తలచు చునుండిన
అట్టి జ్ఞానమే రాజస మనబడు

22.పనులకు తానే కర్తగ తలచుచు
మూలహేతువగు భావము తెలియక
తత్త్వము గూర్చిన భావము నెరుగని
అట్టి జ్ఞానమే తామస మనబడు

23.తానే కర్తగ మదిలో నెంచక
ఫలితము కోరక శాస్త్రము చెప్పిన
రాగద్వేషముల మదిలో నుంచక
చేసే కర్మను సాత్త్విక మందురు

24.ఫలములు కోరుచు చేసెడి పనులును
అహంకారమున చేసెడి పనులును
శ్రమతో కూడిన ప్రయాస తోడను
చేసే కర్మను రాజస మందురు

25.బంధము తోడను హానిని హింసను
శక్తిని యెంచక దానిని తెలియక
మూర్ఖత్వమ్మున పనులను మొదలిడ
చేసే కర్మను తామస మందురు

26.ఆశను వీడుచు గొప్పలు పలుకక
ధైర్యము తోడను ఉత్సాహమ్మున
సిద్ధినసిద్ధిని మార్పును చెందని
వానిని రాజస కర్తగ తెలియుము

27.ఆశను పొందుచు ఫలముల కోరుచు
లోభిగ మారుచు కష్టపెట్టుచును
కలుషము హర్షము శోకము నొందిన
వానిని రాజస కర్తగ తెలియుము

28.ఆత్మనిగ్రహము సంస్కృతి లేకయు
మూర్ఖుడు ధూర్తుడు శరుడును దుఃఖియు
సోమరి వట్టిగ కాలముగడిపెడి
వానిని తామస కర్తగ తెలియుము

29.బుద్ధియు ధైర్యము గుణ భేదమ్ముల
మూడు విధమ్ముల పరగుచు నుండును
వానిని పూర్తిగ వేరు వేరుగను
బాగుగ చెప్పెద వినుమో పార్థా!

30.ప్రవృత్తి నివృత్తి కార్యమకార్యము
భయా భయమ్ములు బంధము మోక్షము
బాగుగ పూర్తిగ తెలిసిన దానిని
సాత్త్విక బుద్ధిగ పేర్కొను చుంటురు

31.ధర్మాధర్మపు బుద్ధులతోడను
కార్యమకార్యము చేసెడియప్పుడు
నిజమును తెలియక చేసెడిదానిని
రాజసబుద్ధిగ పేర్కొను చుందురు

32.ధర్మము కాదని అధర్మమౌనని
జరిగెడు దానిని కాదని యెంచుచు
మూర్ఖ భావనను చేసెడు దానిని
తామస బుద్ధిగ పేర్కొను చుందురు

33.కదలని మనసున ధారణచేయుచు
మనమును ప్రాణము నింద్రియ క్రియలను
ధ్యాన యోగమున చేసే శక్తిని
పార్థుడ! సాత్త్విక ధృతియని అందురు

34.కర్మల ఫలమును కోరుచు మనుజుడు
ధర్మము అర్థము కామము కోరుచు
మనమున ధారణ చేసే శక్తిని
పార్థుడ! రాజస ధృతియని అందురు

35.నిద్రను భయమును దుఃఖము దిగులును
ఉన్మాదముతో వదలక చేయుచు
కల్మష బుద్ధిని ధారణ చేసిన
పార్థుడ! తామస ధృతియని అందురు

36.మూడు విధములగు సుఖములు తెల్పెద
ఆనందమ్మును దుఃఖ మోక్షమును
సాధన చేతను బాగుగ పొందగ
నేను చెప్పునది వినుమో పార్థా!

37.మొదలు పెట్టగా విషమని తోచును
అదియే చివరకు శివముగ మారును
ఆత్మకు చెందిన బుద్ధిని తెలిసిన
సాత్త్విక సుఖమని తెలుపుచు నుందురు

38.విషయేంద్రియముల కలయిక చేతను
అమృత మనదగు సుఖమును మొదటను
పిదప విషముగను మారిన అదియే
రాజస సుఖమని తెలుపుచు నుందురు

39.నిద్రయు అలసత మోహము చేతను
మొదట సుఖముగను పిదప మాయలో
ఆత్మను ముంచుచు తెలియ కుండునది
తామస సుఖమని తెలుపుచు నుందురు

40.భూమిని గానీ నభమున గానీ
దేవలోకమున మరియే చోటుల
ప్రకృతి నుండియే పుట్టిన ప్రాణులు
మూడు గుణమ్ములు వీడియు ఉండదు

41.బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులుగ
కర్మల చేతను సహజ గుణమ్ముల
విభజన నొందిరి వేరు వేరుగను
వినుము పరంతప! నిజమును తెలియుము

42.శమమును దమమును తపమును శుచియును
ఓర్పును సరియగు మార్గ జీవనము
జ్ఞానవిజ్ఞాన మాస్తిక భావపు
గుణములు కల్గిన బ్రాహ్మణుండగను

43.శౌర్యము తేజము ధైర్యము నేర్పును
యుద్ధమునందున పారక నుండుట
దానము పాలన వీటిని వెలసిన
గుణములు కల్గిన క్షత్రియుండగును

44.కృషి గోరక్షణ వర్తకముందగ
గుణములు కల్గిన వైశ్యుడనంబడు
సహజముగానే సేవలు చేసే
గుణములు కల్గిన శూద్రుడనంబడు

45. తమతమ పనులను నేర్పును పొందిన
మనుజుడు నిజముగ సిద్ధిని పొందును
తమతమ పనులను సిద్ధిని పొందగ
వారల విధులను తెలిపెద వినుము

46. ప్రాణులన్నియును ఈశ్వర జన్యమె
జగత్తంతయును ఈశ్వర రూపమె
తమతమ కర్మల నారాధించిన
మానవు డెప్పుడు సిద్ధిని పొందును

47. పరధర్మమ్ములు చేయుట కంటెను
మన ధర్మంబులు చేయుట మేలగు
తనదగు పనులను చేసిన మనుజుడు
పాపము లొందదు సిద్ధిని పొందును

48. దోషముండినను మనదగు కర్మల
పార్థుడ విడుచుట మేలొనరించదు
నిప్పును పొగలే కమ్మినట్లుగను
కర్మ లన్నిటను దోషము సహజము

49. విషయము లందున కోరిక లేకయు
స్పృహలను వీడియు మనసు జయించుచు
సన్న్యాసంబున మెలగెడి వాడే
పరమనైష్కర్య సిద్ధిని పొందును

50. ఏ విధమ్ముగా సిద్ధిని పొందునొ
అట్లే బ్రహ్మను చేరెడి విధమును
జ్ఞాన యోగమున చివరకు చేరెడి
విధమును తెలిపెద వినుమో పార్థా!

51. నిర్మల మనదగు బుద్ధిని కలిగియు
ధైర్యము కూడిన మనో నిగ్రహము
శబ్దము మొదలగు విషయము వదలియు
రాగ ద్వేషముల పూర్తిగ వదలియు

52. శుభ్ర దేశమున ఒంటిగ నుండుచు
అల్పాహారము నారగించుచును
త్రికరణమ్ములను వశమున నుంచుచు
ధ్యానము యోగము వైరాగ్యమ్ముల

53.అహంకారమును బలమును గర్వము
కామము క్రోధము వదలివేయుచును
మమతను వదలిన శాంతిని బొందిన
బ్రహ్మరూపమును పొందసమర్ధుడు

54.బ్రహ్మరూపమును పొందిన వాడును
ప్రసన్న మనమును కలిగిన వాడును
శోకము నొందదు కోరిక కోరదు
సమభావమ్మున మోక్షము పొందును

55.భక్తి చేతనే నన్ను ఎరుంగును
గుణమును శక్తిని పూర్తిగ తెలియును
దాని మూలమున తత్త్వము నెరుగును
తదుపరి నాలో లీనము చెందును

56.సమస్త కర్మల నెప్పుడు చేయుచు
నిజముగ నన్నే ఆశ్రయించుచును
నాయనుకంపను పూర్తిగ పొందుచు
కుదురుగ నుండే మోక్షము పొందును

57. నిండు మనంబున సర్వ కర్మలను
పూర్తిగ నాకే అర్పణ చేయుచు
ధ్యాన యోగమున నన్నే తలచుచు
నాలో నిలుపుము చిత్తము నెప్పుడు

58. నాపై మనసును లగ్న మొనర్చిన
దుఃఖము లన్నియు పటా పంచలగు
అహంభావమున మాట విననిచో
నష్టము పొందుదు వన్నది నిజమే

59. అహంకారమును మనసున వదలక
యుద్ధము చేయని విధమును తలచిన
ఈ నీ యత్నము వృథా యగునులే
నీ స్వభావమే నిను పురిగొల్పును

60. మోహము చేతను నిజమును ఎరుగక
యుద్ధము చేయుట కిష్టపడనిచో
నీ సహజంబగు కర్మల లొంగియు
యుద్ధము తప్పక చేసి తీరెదవు

61.సర్వభూతముల హృదయము లందున
ఈశుడు తప్పక వసించియుండును
యంత్రము నడపెడి వానికివలెనే
తిప్పుచునుండును వారలనెప్పుడు

62.అన్ని విధమ్ముల ఫల్గుణ! నీవే
ఈశుని తప్పక శరణము వేడుము
ఆతని వల్లనె నిజమగు శాంతిని
పరమపదమ్మును నీవు పొందెదవు

63.జ్ఞాన మనందగు పరమ రహస్యము
నీకు తెలిపితిని ఫల్గుణ! వినుమా!
దానిని పూర్తిగ పరిశీలించియు
కూరిమి చేయుము నీవు కోరినది

64.సర్వ రహస్యపు విషయము లందున
పరమం బైనది మరల చెప్పెదను
నాకు ఇష్టుడవు హితమును గూర్చెడి
నామాటలనే నీకు తెల్పెదను

65.నన్నే తలచుము భక్తిని మెలగుము
పూజలు చేయుము నమస్కరింపుము
నాకు ఇష్టుడవు నన్నే పొందుము
ప్రతిజ్ఞ చేయుదు నిజముగ నీకై

66.సర్వ ధర్మములు నాకర్పించియు
నన్నే శరణము వేడుము నీవే
సర్వ పాపముల ముక్తిని నీకే
కలుగగ జేసెద శోకము వదలుము

67.తప మొనరించని భక్తి రహితునకు
వినుటకు ఇష్టము చూపని వానికి
నాపై అసూయ చెందు వానికిని
ఈ నా గీతను చెప్పకు మెపుడును

68.పరమ గోప్యమగు నా ఈ గీతను
భక్తుల కెప్పుడు చెప్పెడి వాడును
భక్తుల మనముల నింపెడు వాడును
శంకలు లేకయు నన్నే పొందును

69.మనుజుల యందున వానికి మించిన
ప్రియమొనరించెడి భక్తుడు ఉండడు
భూలోకమ్మున వానికి మించిన
ప్రియతర రూపుడు వేరే ఉండడు

70.ధర్మయుక్తమౌ మన సంవాదము
గీతా శాస్త్రము పఠించు వాడే
జ్ఞానయజ్ఞమున నను పూజించును
ఇది నా శాస్త్రము తెలియుము పార్థా!

71.శ్రద్ధను కలిగియు అసూయ లేకయు
ఈ నా శాస్త్రము వినెడు వానికిని
పాపము తొలగును పుణ్యము కలుగును
శుభ లోకమ్ములు పొందును నిజముగ

72.నా ఈ గీతను కదలని మనమున
పూర్తిగ వింటివ తెలుపుము పార్థా!
అజ్ఞానమ్మున కలిగిన మోహము
పూర్తిగ తొలగెన తెలుపు ధనంజయ!

73.నీ ప్రసాదమున నా ఈ మోహము
పూర్తిగ తొలగెను తెలిపెను పార్థుడు
జ్ఞానము కలిగెను శంకలు తొలగెను
నీవు చెప్పినది చేయుదు అచ్యుత!

74.వాసుదేవునకు శ్వేతవాహునకు
మధ్యను జరిగిన ఈ సంవాదము
అద్భుతమైనది పూర్తిగ వింటిని
పులకలు కలిగెను సంజయుడనియెను

75.వ్యాసుని కృపచే దివ్యదృష్టిచే
యోగేశ్వరుడగు కృష్ణుడు స్వయముగ
పరమ గోప్యమగు గీతా శాస్త్రము
పార్థున కనగ నేనే వింటిని

76.ఓ ధృతరాష్ట్రుడ! కేశవార్జునుల
ఈ సంవాదము అద్భుతమైనది
పరమ పవిత్రము తలచుచు తలచుచు
మాటిమాటికిని హర్షము నొందితి

77. శ్రీహరి చూపిన విశ్వరూపమే
అద్భుతమైనది అచ్చెరువైనది
మాటిమాటికిని తలచుచు తలచుచు
సంతసించితిని మనమున రాజా!

78. యోగేశ్వరుడును ధనుర్ధారియగు
కృష్ణార్జునులు ఎచ్చట నుందురో
సంపద విజయము భూతియు నీతియు
అచ్చట నుండును తెలియుము రాజా!

ఇది మోక్ష సన్న్యాస యోగము

అనంతగీత సమాప్తము

**శుభం**

# ప్రస్తావన

పనిచేయడం ధర్మం. చేయక పోవడం అధర్మం. అంటే మంచి పని చేయడం ధర్మం. న్యాయ మార్గంలో అందరికీ ఉపయోగ పడే పనిచేయడమే ధర్మం. అన్యాయ మార్గంలో పని చేయడం అధర్మం.

భగవద్గీతలో ధర్మాధర్మాల చర్చజరిగింది. మంచి చెడుల ప్రస్తావన ఉంది. అధర్మంగా ప్రవర్తించడానికి కారణం స్వార్థమే. స్వార్థం లేకపోతే అధర్మానికి స్థానం లేదు.

మనిషి శాంతితో బతకాలి అనేక సందర్భాలలో మనిషిని దుఃఖం ఆవరించి సుఖసంతోషాలను దూరం చేస్తుంది. ఆనందంతో బతకడమే స్వర్గం. ఆనందం లేకపోవడమే నరకం. ఆనందం కృత్రిమమైంది కాకుండా సహజంగా కలగాలి.

అన్ని మతాలు చెప్పేది ఇదే. స్వార్థం ఎక్కువై అన్యాయం పాలన చేస్తున్నప్పుడు కొత్త మతాలు లేదా కొత్త మార్గాలు పుట్టుకొస్తాయి. స్వార్థపరులే మత బోధనలకు విపరీతార్థాలు కల్పిస్తారు. అది ఎక్కువైతే పాపం పండి నాశనమై లేదా క్షీణించి కొత్తవి పుట్టడానికి కారణమౌతుంది.

# అర్జున విషాద యోగం

భగవద్గీతలో మొదటి అధ్యాయం అర్జున విషాదయోగం. యోగం అంటే పొందడం అనవచ్చు. సాధనం అని కూడా అనవచ్చు. అర్జునుడు (నరుడు) విషాదం పొందడం ఇక్కడ ప్రధానాంశం. యుద్ధం చేస్తే ఎందరో చనిపోతారు. అందరికీ బాధ కలుగుతుంది. కాబట్టి యుద్ధం చేయనంటాడు. అయితే ఒక మంచిపని చేస్తున్నప్పుడు కొంత బాధ కలగడం సహజం. శరీరంలో ఏదైనా అంగం పాడైతే దానిని బాగు చేయడానికి లేదా మార్చడానికి వైద్యుడు రోగి శరీరానికి కొంత బాధ కలిగించక తప్పదు. అయితే ఆ బాధను తట్టుకోగల శక్తి సామర్థ్యం రోగికి ఉందా లేదా అని తెలుసుకోవాలి. అంటే తన బలం, అధర్మబలం తెలుసుకుని తగిన సమయంలో చికిత్స చేయాలి.

అధర్మం రాజ్యమేలుతున్నప్పుడు ధర్మాన్ని కాపాడడం కోసం సమాజానికి చికిత్స అవసరమే. అప్పుడు కొంత మంది బాధపడక తప్పదు. ధర్మ స్థాపన కోసం యుద్ధం చేయడానికి తాత్కాలికమైన బాధను అనుభవించక తప్పదు. ఆ తాత్కాలికమైన బాధను అంగీకరించకపోతే అధర్మం విజృంభించి సమాజానికి పెనుముప్పు కలిగిస్తుంది.

అర్జునుడు ఈ ధర్మసూక్ష్మం తెలియక విషాదం పొందితే కృష్ణుడు గీతను ఉపదేశిస్తాడు. అదివిన్న అర్జునుడు చివరకు ధర్మస్థాపన కోసం మోహం పోగొట్టుకుని యుద్ధం చేస్తానంటాడు.

# సాంఖ్య యోగం

రెండవ అధ్యాయం సాంఖ్య యోగం. అంటే మంచి చెడులను లెక్కించడం. ఏది నిజమైన మంచి ఏది చెడు అనేది లెక్క తేల్చడం. ఏది కలకాలం ఉంటుందో, ఏది ఉండదో తెలుసుకోవాలి. సమాజ శ్రేయస్సుకోసం స్వార్థ త్యాగం తప్పదు. కొంతబాధ కలిగినా లెక్కచేయకూడదు. సహించాలి. ధైర్యం వహించాలి. ముందుకు పోవాలి. ఫలాన్ని ఆశించకపోవడమే స్వార్థ త్యాగం. అన్ని తనకే కావాలనుకోవడం స్వార్థం. మంచి పనులవల్ల కలిగే ఫలితం అందరికీ చెందాలనుకోవడం నిస్స్వార్థం. స్వార్థం ఉన్నప్పుడు బాధకూడా ఉంటుంది. స్వార్థం లేనప్పుడు సుఖదుఃఖాలు లాభ నష్టాలు జయాపజయాల ప్రభావం ఉండదు. అంతిమ లక్ష్యం కోసం అంటే సమాజ శ్రేయస్సుకోసం కృషి చేయడమే ప్రధానమవుతుంది. స్వార్థం లేకపోతే ఫలితం ఎవరికి చెందినా ఆనందం కలుగుతుంది. అది అధర్మపరుల పాలు కాకుండా జాగ్రత్త పడాలి.

ప్రతివాడూ సమాజం కోసం పాటు పడాలి. పనిచేయాలి. అదే పుణ్యం. తన సుఖం కోసం సమాజాన్ని బాధపెట్టడమే పాపం. స్థిరబుద్ధి ఉన్నవాడు దేనికీ బాధపడడు. తన పని ఆపడు. మంచి కోసం కృషి చేస్తూనే ఉంటాడు. మంచిపని చేయలేకపోతే మరణమే మేలనుకుంటాడు. కోరిక ఉండి తీరకపోతే బాధకలుగుతుంది. స్వార్థం వదలితే శాంతిలభిస్తుంది. అప్పుడే ఆనందం. అదే పరమానందం. అదే బ్రహ్మానందం.

# కర్మయోగం

ఫలం కోరకుండా పని చేయాలి. ఫలం కోసం యుద్ధం చేయాలి. ఏమిటీ వైరుధ్యం. అంటే స్వార్థం లేకుండా ఉండాలి. మంచి కోసం ఎదురు దెబ్బలు తగిలినా వదలకుండా తన లక్ష్యం కోసం కృషి చేయాలి.

ప్రతిజీవి ఏదో పని చేయక తప్పదు. చేస్తూనే ఉంటాడు. ప్రకృతి ప్రతి మనిషిని పనిచేసేట్లు చేస్తుంది. అయితే తన పని తాను చేయాలి. వీలైతే ఇతరులకు సాయం చేయవచ్చు. అయితే తనపని ఎగొట్టికాదు. తనపని చేయనివాడు మోసగాడే. అంటే దొంగే. అందుకే పనిలో నిజాయితీ ఉండాలి. ఒక్కొక్కప్పుడు పనికి తగ్గ ఫలితం వెంటనే కలుగక పోవచ్చు. అంతమాత్రాన నిరుత్సాహపడకూడదు. గొప్పవాళ్ళు ఎప్పుడూ మంచి పనులు చేస్తూనే ఉంటారు. ఇతరులకు కేవలం బోధలు చేసే వాళ్లు గొప్ప వాళ్లుకారు ఆచరణలో చూపాలి. తనపని తాను చేయడమే ధర్మం. కోరికలు కోపతాపాలు మనిషిని పాపకార్యాలకు ప్రేరేపిస్తాయి. కాబట్టి ఇవి శత్రువులే. సమాజంలో ఇప్పుడివి ఎక్కువగానే కనబడుతోంది. స్థిరచిత్తం ఉన్నవాళ్ల దగ్గరకు అవిరావు. అంటే తన మనస్సు తన వశంలో ఉంచుకోవాలి. చెడువైపు పోనీయకూడదు.

సమాజంకోసం మంచిపనులు చేయాలి. ఎందుకంటే వ్యక్తికంటే సమాజం గొప్పది. శక్తివంతమైంది. ఈ విషయం తెలుసుకుని మంచికోసం కృషి చేయాలి. చెడును తరిమివేయాలి.

# జ్ఞానయోగం

సమాజం ఎప్పుడూ గొప్పదే. అది ఎప్పటికీ నాశనం కాదు. కాకపోతే మారుతుంటుంది. దానికి మంచి రూపం కల్పించడానికి కృషి చేయాలి. ధర్మాన్ని అణచివేసే ప్రయత్నంతో అధర్మం విజృంభిస్తే ధర్మం తిరగబడుతుంది. అప్పుడు చెడ్డవాళ్లు నాశనం కాక తప్పదు. మంచివాళ్ళు గొప్పవాళ్లవుతారు. మనిషి ఎప్పుడు తనగుణానికి తగ్గపని చేస్తాడు. ఏపని చేసినా సమాజానికి ఉపయోగపడితే మెప్పును పొందుతాడు. ఎంత గొప్పవాళ్లైనా పనిచేయకతప్పదు. స్వార్థం లేకుండా పనిచేసేవాడే గొప్పవాడు. తనకు కలిగే జయాపజయాలు, మానావమానాలు, సుఖ దుఃఖాలు లెక్కచేయకుండా సమాజంకోసమే నేను పనిచేస్తున్నాను. నేను సమాజంలో భాగమే అని అనుకునే వాడే గొప్పవాడు.

పెద్దవాళ్ల వల్ల మనకు అనేక విషయాలు తెలుస్తాయి. వారు చెప్పే మంచిని గ్రహించాలి. చెడును దూరం చేయాలి. వీలైతే నాశనం చేయాలి. తాత్సారం కూడదు. అనుమానం అసలే ఉండకూడదు. మంచి చేయని వాడు ఖచ్చితంగా మనసులో బాధపడతాడు. మంచిని తెలుసుకుని దానిని ఆచరించిన వాడు తృప్తిపడతాడు. ఆనందిస్తాడు.

# కర్మ సన్యాస యోగం

పని మానకూడదు. వెంటనే ఫలితం రాలేదని బాధపడ కూడదు. దానికోసం ఎవరిని తిట్టవద్దు. అసహ్యించుకోవద్దు. స్వార్థం లేనివాడికి ఎప్పుడూ బాధ కలుగదు. ఎవరిపైనా కోపం రాదు. అందరినీ కలుపుకుని పోవడానికే ప్రయత్నిస్తాడు.

అందరూ తన లాంటి వాళ్లే అనుకోవాలి. అందరికోసం తానున్నానని అనుకోవాలి. అప్పుడే సమాజం అతన్ని తనవానిగా, తనలోని వానిగా గుర్తిస్తుంది. ఫలితం తనకు దొరకక పోయినా దానికి అంటుకు పోకుండా తామరాకు మీది నీటి బొట్టులాగా ముందుకు సాగి పోవాలి.

సమాజంలో పనికిరాని వస్తువేదీ లేదు. పనికిరాని వ్యక్తీ లేడు. అందరినీ సమాజంగా గౌరవించాలి. వాణ్నే సమాజం గౌరవిస్తుంది. అలాంటి వాడు దేనికీ బాధపడడు. అహంకార పడడు. సుఖదుఃఖాలు సహజం. దానికి అతీతంగా మెలగడమే గొప్పతనం. ఎప్పుడు చిరునవ్వుతో ఉండేవాడే ఆనందంతో నలుగురి మెప్పు పొందుతాడు. సంతోషంగా సమాజం కోసం అంకిత మౌతాడు. శాంతిని పొందగలుగుతాడు.

# ఆత్మ సంయమ యోగం

పని చేయాలి అనే బుద్ధి ఉండాలి. అది ఎక్కువ మందికి ఉపయోగపడే పనై ఉండాలి. వాడే నిజమైన యోగి. మంచి పనులు చేస్తూ ఉంటేనే మంచి బుద్ధి కలుగుతుంది. అట్లాంటి బుద్ధి కలగాలంటే సాధన చేయాలి. సాధన ద్వారా శాంతిని కూడా పొందవచ్చు. కృషి చేస్తేనే మనిషి బాగుపడతాడు. కృషిలేకపోతే పాడౌతాడు. తనకు బాధకలిగితే ఇతరులను నిందించకూడదు. మంచైనా చెడైనా తాను చేసే పనిని బట్టే ఉంటుంది. తనకు తానే శత్రువు. తనకు తానే మిత్రుడు. స్వార్థాన్ని జయిస్తే మంచిపని చేసినట్లే. అతడు మానావమానాలకు అతీతుడే.

తనను తానెప్పుడూ ప్రశ్నించుకోవాలి. సాధన ద్వారానే మంచిని చేయగలుగుతాడు. చెడుకు లొంగిపోకుండా మంచికోసం కృషి చేయాలి. మంచివాడెప్పుడూ కోపాన్ని గాని భయాన్ని గాని దగ్గరకు రానీయడు. తగిన ఆహారం, తగిన నిద్ర, తగిన ప్రవర్తన, తగిన పని కలిగిన వాణ్ని యోగి అనవచ్చు. అభ్యాసం ద్వారానే మనసు కుదుట పడుతుంది. అట్టివానికి అందరూ సమానమే.

చెడ్డవాడు ఎక్కడ ఉన్నా, ఎన్ని ఉన్నా, బాధపడుతూనే ఉంటాడు. అశాంతికి గురౌతాడు. తపనకన్నా తెలుసుకోవడం ముఖ్యం. తెలుసుకోవడం కంటే ఆచరించడమే గొప్ప. మంచిని అనుసరించే వాడే యోగి. మంచి మార్గంలో నడచే వాడే ఉత్తముడు.

# విజ్ఞాన యోగం

దేవునిపై మనసు లగ్నం చేసి అతన్ని పూర్తిగా ఆశ్రయిస్తేనే అతన్ని పూర్తిగా తెలుసుకోవచ్చు. దైవానికి మించిన జ్ఞానం లేదు. లక్షలాది మందిలో ఏ ఒక్కరికో ఆ జ్ఞానం లభిస్తుంది. దైవ రూపమే పరా ప్రకృతి. ప్రకృతితో కూడుకున్నదే అపరాప్రకృతి. ఈ రెండు ప్రకృతులు సృష్టికి కారణమే. వీటిలో పరాప్రకృతే గొప్పది. అంతట ఉండేవాడే దేవుడు. నీటిలోని రుచి, సూర్యచంద్రుల కాంతి, వేదాల ఓంకారం, ఆకాశంలోని శబ్దం, మనిషిలోని పౌరుషం అంతా దైవమే. ప్రాణులందరిలోని బీజం దైవమే.

సత్త్వరజస్తమ గుణాలపైనే ఈ ప్రపంచం ఆధారపడి ఉంటుంది. వాటికి అతీతంగా ఉంటేనే మనిషి మాయ నుండి తప్పించుకోగలుగుతాడు. ముక్తిని పొందగలుగుతాడు.

భక్తులు నాలుగు రకాలుగా ఉంటారు. తమ కష్టాలు దూరం కావాలని కొందరు, దేవుణ్ని తెలుసు కోవాలని కొందరు, సంపదల కోసం కొందరు, జ్ఞానంతో కొందు దేవుణ్ని పూజిస్తారు. వీరిలో జ్ఞానియే నిజమైన భక్తుడు. ఏ కోరికతో దేవుణ్ని పూజిస్తే అదే కోరిక నెరవేరుతుంది. ఆ దేవునిమీద గట్టినమ్మకం ఏర్పడు తుంది. కాని దాని ఫలితం స్థిరంకాదు. స్వార్థ రహితంగా నిజమైన దైవాన్ని తెలుసుకుని చేసే పూజ దేవునిలో లీనమవడానికి తోడ్పడు తుంది. మూర్ఖులు దైవ స్వరూపాన్ని, దైవతత్త్వాన్ని తెలుసుకోలేరు.

# అక్షర పరబ్రహ్మ యోగం

బ్రహ్మమంటే దేవుడు. ఆ దేవుడు జీవ రూపంలో ఉంటే ఆధ్యాత్మ. జీవుల ఉత్పత్తికీ, అభివృద్ధికీ చేసే పనులే యజ్ఞాలు. అధి భూతమంటే శరీరమే. అధిదైవమంటే ప్రాణమే. అధియజ్ఞమంటే దేవుడే.

దేవుణ్ని తలుస్తూ చనిపోతే దైవాన్నే చేరుకుంటారు. చివరి సమయంలో ఏది తలిస్తే అదే పొందుతారు. పుణ్య కార్యాలు చేసినా కోరిక తీరకపోతే ఆ కోరిక తీర్చుకోవడం కోసం మళ్లీ పుట్టక తప్పదు. భక్తితో దేవుణ్ణి చేరుకుంటే మళ్లీ పుట్టుక ఉండదు.

ప్రతి మానవుడికి రెండు మార్గాలుంటాయి. ప్రకాశంతో కూడిన ఉత్తరాయణ మార్గంలో పయనిస్తే మళ్లీ తిరిగి రారు. దేవుడి దగ్గరే ఉండిపోతారు. ప్రకాశం లేని దక్షిణాయన మార్గంలోకి పయనిస్తే ప్రపంచం చుట్టూ తిరుగుతూనే ఉంటారు. యోగులు పుణ్యాల కతీతంగా కాంతి మార్గాన్నే కోరుకుంటారు.

# రాజ విద్యా రాజ గుహ్య యోగం

జ్ఞానం అంటే బ్రహ్మను తెలిపే జ్ఞానం. అదేరాజ విద్య. దాని తెలుసుకోవడం చాలా కష్టం. అన్ని చోట్లా అందరిలోనూ దేవుడుంటాడు. దేవుడిలో అందరూ భాగమే. ఆకాశంలో గాలి ఉన్నట్లు ప్రాణుల్లో దేవుడుంటారు. ప్రళయ కాలంలో జీవులన్నీ దేవునిలో కలిసి పోతాయి. మళ్లీ సృష్టి ప్రారంభంలో వివిధ రూపాల్లో పుడతాయి. కానీ దేవుడు ఈ కార్యక్రమాలన్నిటికీ అతీతంగా అంటే అంటీ అంటనట్లుగా ఉంటాడు.

అజ్ఞాని దైవరూపాన్ని, తత్వాన్ని తెలుసుకోలేడు. జ్ఞాని తెలుసుకుంటాడు. యజ్ఞాలు చేయడం వల్ల స్వర్గం లభిస్తుంది. కానీ ఆ పుణ్యం తరిగిన తరువాత తిరిగి లోకాలకు రావలసి వస్తుంది. అంటే వాళ్లకు సుఖ దుఃఖాలు తప్పవు. ఏ కోరిక లేకుండా భక్తితో దేవుణ్ణి పూజించేవాడు జనన మరణాల చక్రంలో చిక్కుకోడు. భగవంతునికి అందరూ సమానమే. భక్తి ఉన్నవాడే మంచివాడౌతాడు. అంటే భగవంతునిలో భాగమవుతాడు.

# విభూతి యోగము

ఆద్యంతాలు లేనివాడే దేవుడు. జ్ఞానమే దేవుడు. దేవతలు మునులు కూడా దేవుణ్ణి గురించి పూర్తిగా తెలుసుకోలేరు. సమస్త ప్రాణుల హృదయాల్లో దేవుడుంటాడు. ప్రాణులను పుట్టించడం, పెంచడం, చంపడం అంతా దేవుని చేతుల్లోనే ఉంది. భగవంతుణ్ని తెలుసుకుంటే ముక్తిని పొందినట్లే.

ప్రపంచంలోని గొప్ప వస్తువులన్నీ దైవ స్వరూపాలే. ఆదిత్యులలో విష్ణువు, ప్రకాశించే వానిలో సూర్యుడు, చుక్కల్లో చంద్రుడు, వేదాలలో సామవేదం, దేవతల్లో ఇంద్రుడు, ఇంద్రియాలలో మనసు, పర్వతాలలో మేరువు, చెట్లలో రావి చెట్టు, దేవ ఋషులలో నారదుడు, ఆవుల్లో కామధేనువు. నాగుల్లో అనంతుడు. శిక్షించేవారిలో యముడు. వేగంలో గాలి, నదుల్లో గంగ, అక్షరాల్లో అకారం, సమాసాల్లో ద్వంద్వం, ఛందస్సుల్లో గాయత్రి, మాసాల్లో మార్గశిరం, ఋతువుల్లో వసంతం, గుణాల్లో సత్త్వగుణం, రహస్యాల్లో మౌనం, జ్ఞానవంతుల్లోని విజ్ఞానం ఇలా సమస్త జీవుల్లోని సారం దైవమే. అన్నిటినీ ధరించేది పోషించేది దైవమే.

# విశ్వరూప సందర్శన యోగం

ఇందులో భగవంతుని విరాట్ స్వరూపం వర్ణించబడింది. దైవం గురించిన జ్ఞానాన్ని, దైవంలోని గొప్ప తనాన్ని తెలుసుకున్న అర్జునుడికి దేవుని విరాట్ రూపం చూడాలనిపించింది. అదే విషయాన్ని కృష్ణుని అడిగాడు. ఆయన అంగీకరించాడు. కానీ సాధారణమైన దృష్టితో దేవుణ్ణి చూడడం సాధ్యం కాదు. కాబట్టి దివ్య దృష్టినిచ్చాడు. అంటే విశాల దృష్టి అన్న మాట. నిజమైన భక్తునికి మాత్రమే ఆ దృష్టి లభిస్తుంది.

లెక్కలేనన్ని ముఖాలు, కళ్లు ప్రకాశవంతమైన అద్భుతమైన రూపం. దివ్యమైన ఆభరణాలు, ఆయుధాలు, రంగురంగుల వస్త్రాలు, పూల రంగులు, సువాసనలతో అన్ని దిక్కులా వ్యాపించి, వర్ణించ తరంకాని ప్రపంచం అంతా తనలో ఉన్న ఆశ్చర్యకరమైన దేవుని విరాట్ రూపాన్ని చూచాడు. శ్రద్ధాభక్తులతో శిరస్సు వంచి నమస్కారం చేశాడు. బ్రహ్మ, శివుడు దేవతలు, మునులు అందరూ కనబడ్డారు. కురుక్షేత్రంలో ఉన్నవారందరూ కూడా కన బడ్డారు. జరిగింది, జరగబోయేది చూసి కొంచెం భయపడ్డాడు. తట్టుకో లేక మళ్లీ మామూలు రూపంలో కనబడమని ప్రార్థించాడు. కృష్ణుని గొప్ప తనం తెలుసుకోక, సామాన్యునిగా, స్నేహితునిగా చూసినందుకు మన్నించమని వేడుకొన్నాడు. అర్జునుని కోరికపై కృష్ణుడు మళ్లీ తన ప్రశాంతరూపాన్ని పొందాడు. నీవు యుద్ధంలో వీరిని చంపక పోయినా వీరందరూ చావక తప్పదని తెలిపాడు. కాబట్టి అర్జునా! నీ కర్తవ్యంగా భావించి యుద్ధంలో వీరిని చంపి కీర్తిని పొందమన్నాడు. నా విరాట్ రూపాన్ని గొప్ప భక్తులు మాత్రమే చూడగలరు. నిజమైన భక్తుడే నన్ను చేరుకుంటాడని తెలిపాడు.

# భక్తియోగం

ఎప్పుడూ మనస్సు భగవంతునిపై నిలిపి సాటిలేని భక్తితో భజన, ధ్యానాదులతో దేవుణ్ని పూజించే వాడే గొప్పయోగి.

ఇంద్రియాలను వశపరచుకొని, అచలమైన మనస్సుతో దేవుని ధ్యానించేవాడు కూడా యోగియే. నిరాకార బ్రహ్మను ధ్యానించడం అంత తేలిక కాదు. ప్రాణులకు హితం చేయాలి. ఏ కర్మ చేసినా దేవునికే అర్పించాలి. లేదా కర్మ ఫలాన్ని త్యాగం చేయాలి.

అభ్యాసంకన్నా జ్ఞానం, జ్ఞానంకన్నా ధ్యానం, ధ్యానంకన్నా త్యాగం గొప్పది. త్యాగం వల్లే శాంతి లభిస్తుంది.

నిజమైన భక్తుడు ఎవరినీ ద్వేషించడు. అందరితో స్నేహంగా ఉంటాడు. సుఖదుఃఖాల యందు సమభావం కలిగి ఉంటాడు. ఇంద్రియాల్ని తన వశంలో ఉంచుకుంటాడు. దేనికీ భయపడడు. బెదరడు. ప్రాణులపై దయ చూపిస్తాడు. ప్రేమతో మెలగుతాడు. అహంకరించడు. అవమానాలకు క్రుంగిపోడు. పొగడ్తలకు పొంగిపోడు. నిందాస్తుతులను సమానంగా గ్రహిస్తాడు. ఏ పనైనా దృఢమైన నిశ్చయంతో చేస్తాడు.

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం

క్షేత్రం అంటే ప్రదేశం. క్షేత్రజ్ఞుడంటే జీవుడు. క్షేత్రంలో పంచ భూతాలు, అహంకారం, బుద్ధి, ఇంద్రియాలు, వాటి వికారాలుంటాయి. క్షేత్ర క్షేత్రజ్ఞుల గూర్చి తెలుసుకోవడమే జ్ఞానం. అదే నిజమైన విజ్ఞానం కూడా!

తనను తాను పొగడుకోకవడం, గర్వం లేకుండా ఉండడం, తరులను బాధించకుండా మెలగడం, ఓర్పు, శుభ్రత, స్థిరత్వం, మనో నిగ్రహం కలిగి పుట్టుక, చావు, ముసలి తనం, రోగం మొదలగు వానివల్ల కలిగే దుఃఖాలకు బాధపడక, సంసార విషయాలపై ఆసక్తిలేక అందం యెడ సమ బుద్ధికలిగి ఉండడమే జ్ఞానం.

దేవుడుఅంతటా ఉంటాడు. అన్నింటి యందు ఒకేలా ఉంటాడు. ప్రకృతి పురుషుడు అనాదిగా ఉన్నవే. గుణాలు వాని వికారాలు ప్రకృతి నుండే పుడతాయి. సుఖ దుఃఖాలు అనుభవించే వాడు పురుషుడు. అకాశం అంతటా ఉంటుంది. కాని సూక్ష్మంగా ఉంటుంది. సూర్యుడు తన కాంతిని అన్నిచోట్లా వ్యాపింపచేసినట్లే, ప్రాణం శరీరం అంతటా వ్యాపించి ఉంటుంది. క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదం తెలుసుకుని జ్ఞాన దృష్టిచే ముక్తిని పొందవచ్చు.

# గుణత్రయ విభాగయోగం

ఉత్తమ జ్ఞానాన్ని పొందిన వాళ్లు, బంధాల నుండి విడివడి దేవుణ్ణి చేరుకుంటారు. అందరూ పుట్టేది ప్రకృతి నుండే. బీజాన్నిచ్చేది దేవుడు. అంటే ప్రకృతి తల్లి, దేవుడు తండ్రి.

ప్రకృతి ద్వారా కలిగే గుణాలు మూడు. అవే సత్త్వరజస్తమో గుణాలు. సత్త్వం ప్రకాశాన్నిస్తుంది. ప్రాపంచిక సుఖాల్ని కలుగజేస్తుంది. రజోగుణం కోరికల్ని పుట్టిస్తుంది. కర్మలు చేయిస్తుంది. తమోగుణం మోహాన్ని కలుగజేస్తుంది. ప్రమాదంలో పడవేస్తుంది. సత్త్వగుణం రజస్తమోగుణాల్ని, రజాగుణం సత్త్వతమో గుణాల్ని, తమోగుణం సత్త్వరజోగుణాల్ని అణచివేయడానికి ప్రయత్నం చేస్తాయి. సత్త్వగుణం ద్వారా జ్ఞానం కలుగుతుంది. స్వర్గం ప్రాప్తిస్తుంది రజోగుణం ద్వారా కోరికలు, లోభం కలుగుతాయి. మా . కం ప్రాప్తిస్తుంది. తమోగుణం ద్వారా అజ్ఞానం ప్రమాదాలు కలుగుతాయి. నరకం ప్రాప్తిస్తుంది.

ఈ మూడింటికి అతీతంగా ఉండేవాడే శాంతిని పొంది దేవునిలో లీనమవుతాడు. అతనికి సుఖ దుఃఖాలు మానావమానాలు, మట్టి బంగారం అంతా సమానంగానే కనబడుతుంది. దానికి నిజమైన భక్తుడే అర్హుడు.

# పురుషోత్తమ యోగం

ఈ సంసారం విచిత్రమైన రావిచెట్టులాంటిది. దానిని అర్థం చేసుకోవడం కష్టం. అది ఎప్పుడు పుట్టిందో, ఎట్లా ఉంటుందో తెలియదు. అహంకార మమకార మూలమైన ఈ చెట్టును కొట్టాలంటే వైరాగ్యమనే ఆయుధం కావాలి.

ఈ చెట్టు గురించి తెలుసుకుంటే నిజం తెలుసుకున్నట్లే. వేదాలే దీని ఆకులు, సత్వరజస్తమో గుణాలే దీని కొమ్మలు. విషయవాసన లే చిగురుటాకులు. జీవి చేసే కర్మను బట్టి దాని వేళ్లు లోపలికి పోతుంటాయి. దీని మొదలు చివర కనబడదు. ఈ చెట్టులో చిక్కకుండా దేవుణ్ణి వెతకాలంటే కోరికలు వదలాలి. అన్నిటి యందు సమభావం కలిగి ఉండాలి. అప్పుడే దేవుని దగ్గరకు వెళ్ల గలుగుతాం.

ఈ లోకంలో మూడు విషయాలున్నాయి. అందు మొదటిది క్షరం అంటే నాశనమవుతుండేది. అదే ప్రకృతి. రెండోది అక్షరం అంటే నాశనం లేనిది. అదే ఆత్మ లేక ప్రాణం. మూడోది పురుషోత్తమ ప్రాప్తి. దీనిని తెలుసుకోవడం కష్టం.

# దైవాసుర సంపద్విభాగ యోగం

ఈ సృష్టిని చేసేవాడు దేవుడే. ఈ సృష్టిలో దైవ సంపదా, అసుర సంపదా రెండూ ఉన్నాయి. నిర్భయం, చిత్తశుద్ధి, దానగుణం, ఇంద్రియ వశం, యజ్ఞం, వేద పఠనం, మంచి ప్రవర్తన, అహింస, సత్యం, త్యాగం, దయ, కోపం లేకపోవడం ఇవన్నీ దైవ సంపదలు. అహంకారం, అజ్ఞానం, కఠినత్వం, కోపం ఇవన్నీ అసుర సంపదలు.

దైవ సంపద ముక్తినిస్తుంది. అసుర సంపద బంధాన్నిస్తుంది. దైవ సంపద ఉన్నవారు దేవతలు. అసుర సంపద ఉన్నవారు రాక్షసులు. అంటే మంచి గుణాలున్న వారే దేవతలు. చెడ్డ గుణాలున్నవారు రాక్షసులు.

రాక్షస స్వభావం ఉన్నవాళ్లకి శుభ్రత ఉండదు. మంచి అలవాట్లుండవు. స్త్రీ పురుషుల కలయికే సృష్టికి కారణం. కోరికలను అనుభవించాలి అని అనుకుంటూ దాని కోసం ఎప్పుడూ బాధపడుతుంటారు. ఆశ ఎక్కువైతే తృప్తి ఉండదు. అన్యాయంగానైనా డబ్బు సంపాదించాలి అనుకుంటారు. అట్లాంటి వాళ్లు మోహంతో భోగాల్లో చిక్కుకుని నరకంలో పడతారు. కోరిక, కోపం, పిసినారితనం ఈ మూడు నరకానికి మార్గాలు. ఏది మంచిదో శాస్త్రం చెబుతుంది. శాస్త్ర విరుద్ధంగా ప్రవర్తించ కూడదు. అంటే మంచి చేయాలి. చెడుచేయకూడదు.

# శ్రద్ధాత్రయ విభాగయోగం

శ్రద్ధ, భోజనం, యజ్ఞం, తపస్సు దానం ఇవన్నీ సాత్త్విక, రాజస తామస భేదాలతో మూడురకాలుగా ఉంటాయి. సాత్త్వికులు దేవతల్నీ, రాజసికులు యక్షుల్నీ, తామసికులు భూత ప్రేతాల్ని పూజిస్తారు.

సాత్త్వికులు ఆయుష్షు, బలం, ఆరోగ్యం, ఇచ్చే రుచికరమైన ఆహారం భుజిస్తారు. రాజసులు చేదు, కారం, ఉప్పు, పులుపు రుచులు కలిగి ఎప్పుడూ దాహం వేసే ఆహారం భుజిస్తారు. తామసులు పాడైన, పాచిపోయిన, ఎంగిలైన, చెడువాసన కలిగిన ఆహారాన్ని భుజిస్తారు. స్వాత్త్వికులు స్వార్థం లేని మంచి పనులు చేస్తారు. రాజసులు ఫలాన్ని ఆశించి పనులు చేస్తారు. తామసులు ప్రమాదాలు కలిగించే ఎవరికీ ఉపయోగం లేని పనులు చేస్తారు.

శారీరకం, వాచికం, మానసికం అని తపస్సు మూడు విధాలు గా ఉంటుంది. తపో ఫలాన్ని ఆశించకపోతే సాత్త్విక తపస్సు ఫలాన్ని కోరితే రాజతపస్సు. బాధ కలిగించేది తామస తపస్సు. ప్రతి ఫలం కోరకుండా అవసరమైన వారికిచ్చేది సాత్త్విక దానం. ప్రతి ఫలాన్ని కోరేది రాజస దానం, ఎవరికీ ఉపయోగపడనిది తామస దానం. ఓం తత్ సత్ అనే పేర్లతోకూడా దేవుణ్ని పిలుస్తాము. మంచి పనుల ప్రారంభమే ఓం కారం. స్వార్థం లేకుండా చేసే యజ్ఞదాన తపస్సులే తత్. మంచి ఉద్దేశంతో దేవున్ని స్మరిస్తూ మంచి పనులు చేస్తే సత్. శ్రద్ధ లేకుండా చేసేది అసత్. దాని వల్ల ఎవరికీ ఎక్కడా సుఖం ఉండదు.

# మోక్ష సన్యాస యోగం

ఈ అధ్యాయంలో గీతాసారం మళ్లీ చెప్పబడింది.

బంధ విముక్తే మోక్షం. త్యాగమే సన్యాసం. కోరిక వదలడం సన్యాసం. స్వార్థంలేని పనే త్యాగం. మంచి పనులెప్పుడూ చేస్తూనే ఉండాలి. వదలకూడదు. సద్బుద్ధితో చేయాలి. స్వార్థం లేకుండా చేయాలి. అదే తృప్తినిస్తుంది. నిజమైన సుఖాన్నిస్తుంది. శరీరం ధరించి ఉన్నప్పుడు ఏదో పనిచేయక తప్పదు. మంచి పనిచేస్తే మంచివాడౌతాడు.

చేసే పనిని బట్టి, గుణాన్ని బట్టి అతడెట్లాంటివాడో తెలుసుకోవచ్చు. శాంతి, శుభ్రత, సహనం ఇంద్రియ నిగ్రహం కలిగి మంచిని చెబుతూ మంచి పనులు చేసేవాడే బ్రాహ్మణుడు. ధైర్యం, శౌర్యం, దయ, దాన గుణం ఉన్నవాడే క్షత్రియుడు. వ్యవసాయం, వ్యాపారం చేసేవాడు వైశ్యుడు. సేవలు చేసేవాడు శూద్రుడు. ఎవరిలోనైనా ఈ గుణాలుండవచ్చు. ఏదైనా ధర్మంగా చేయాలి. శ్రద్ధతో చేయాలి. మనస్ఫూర్తిగా చేయాలి. నిప్పును పొగకమ్మినట్లు ఒక్కొక్కడు తను చేసే పనుల్లో దోషాలుండవచ్చు. అయినా పని మాన కూడదు. తన ధర్మాన్ని తాను ఆచరించాలి. మోహంతో ఇతర ధర్మాలపైకి దృష్టి పోనీయకూడదు. మంచిపని చేసేవాడెవడైనా మోక్షానికి అర్హుడే.

ఇదంతా విన్న అర్జునుడు తన ధర్మాన్ని నిర్వహిస్తానంటాడు. అందుకే మంచిని చెప్పేవాడు మంచిని చేసేవాడు ఉన్నచోట అంటే నరనారాయణు లున్నచోట నీతీ, నిజాయితీ, సంపదా, విజయం తప్పకుండా ఉంటుంది. అదే ధర్మక్షేత్రం.



స్వర్గీయ మొసలి రంగారెడ్డి గారు



స్వర్గీయ మొసలి శ్రీనివాసరెడ్డి గారు

వినదగునెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింప దగున్
గనికల్ల నిజము తెలిసిన
మనుజుడెపో నీతి పరుడు మహిలో సుమతీ !

ఎవరు చెప్పినా వినవచ్చును. వినగానే తొందరపడక అది నిజమో, అబద్ధమో తెలుసుకోవాలి. అట్టి వాడే నీతి నెరిగినవాడు.



రైతుబాంధవుడు

**స్వర్గీయ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి గారు**

మాజీ వ్యవసాయ శాఖా మాత్యులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ !

మేలు చేసినవారికి తిరిగి మేలు చేయడం గొప్ప కాదు. కీడు చేసిన వారికి తప్పు తలంపక మేలు చేయువాడే నేర్పరి.